# 1857 - తిరుగుబాటు

రచన

**తల్మిజ్ ఖల్దున్**

తెలుగు

**హరిపురుషోత్తమరావు**



హైదరాబాద్ బుక్ ట్రస్ట్

**వెల : 3-25**

ట్రస్ట్ సంపాదకుడు : చేకూరి రామారావు
కవర్ డిజైన్ : షరీఫ్
మొదటి ముద్రణ : ఏప్రిల్, 1988
వివరాలకు : హైదరాబాద్ బుక్ ట్రస్ట్
3-6-687, 10వ వీధి
హిమాయత్‌నగర్
హైదరాబాద్ - 500 029.

ముద్రణ : హైదరాబాద్ ప్రింటర్స్, హబ్సిగూడ, హైదరాబాద్.

## ముందుమాట

1857 లో జరిగిన గొప్ప తిరుగుబాటు చరిత్రకారుల్ని ఆకట్టుకొన్నంతగా, మరి యేయితర చారిత్రక ఘటన ఆకర్షించలేదు. అందుకనే 1857 గురించి అసంఖ్యాకమైన రచనలు-భారతీయులూ, విదేశీయులూ రాసినవి- వెలువడ్డాయి. ఇప్పటికి ఆ తిరుగుబాటు స్వభావాన్ని గూర్చి వాదోపవాదాలు జరుగుతూనే వున్నాయి. 1857 తిరుగుబాటు, ఆ పోరాటంలో వీరోచితంగా పోరాడి అమరులైన వ్యక్తులఘనత, పోరాట సంప్రదాయం నేటికి దేశంలో యువకుల్ని, రాజకీయపక్షాలనూ ప్రభావితం చేస్తూనే వున్నాయి. ఇంతటి ఉత్తేజపూరితమైన చారిత్రక ఘటన కాబట్టే దాన్ని గూర్చిన మదింపు సరిగ్గా చేయాల్సిన అవసరం ఎంతైనా వుంది.

బ్రిటిష్ చరిత్రకారులు దీన్ని కేవలం సిపాయిల తిరుగుబాటుగా చిత్రించారు. అందులో ఆశ్చర్యపడాల్సిందేమీలేదు. ఆ విధమైన చిత్రణ బ్రిటిష్ సామ్రాజ్యవాద ప్రయోజనాలకు అనుగుణంగా వుంది. భారతీయ చరిత్రకారులు కొందరు ఈ ఘటనను ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంగా అభివర్ణించారు. ముఖ్యంగా భారత జాతీయోద్యమకాలంలో, భారతదేశచరిత్రను రచించడంలో గతాన్ని ఎంతో ప్రాముఖ్యంగా చెప్పడానికి జరిగిన ప్రయత్నాల్లో ఇదొక భాగంగా అర్థం చేసుకొన్నా, వీరిఅభిప్రాయమూ సరైంది కాదు. బ్రిటిష్ చరిత్రకారులు సామ్రాజ్యవాద అహంకారంతో పితూరీగా వర్ణిస్తే, భారతీయచరిత్రకారులు జాతీయతాభావాన్ని విమర్శనాత్మకంగా పరిశీలించకుండా, స్వాతంత్ర్య సంగ్రామానికి ఇది తొలిసోపానమని భావించడం జరిగింది.

అయితే 1857 తిరుగుబాటు స్వభావాన్ని, ప్రాముఖ్యాన్ని చారిత్రకదృష్టితో పరిశీలించాల్సివుంది. ఆధునిక భారతదేశ చరిత్రక్రమంలో ఈ తిరుగుబాటు ఒక గొప్పమజిలీ. అటు బ్రిటీష్‌వారి విధానాల్లోనూ, పరిపాలనలోనూ, ఇటు భారతీయుల స్వాతంత్ర్య పిపాసలోనూ, భారతదేశంలో ఆపై రానున్న పరిణామాల్లోనూ ఈ తిరుగుబాటు గొప్ప ప్రాముఖ్యాన్ని సంతరించుకొంది. రాజకీయపరమైన కారణాలను అధిగమించి, సిపాయిలలో ప్రారంభమైన తిరుగుబాటు, ముఖ్యంగా ఉత్తర మధ్యభారతదేశంలో సమాజంలోని అనేక వర్గాలకు విస్తరించింది. బ్రిటీష్‌వారి అస్తిత్వానికే అది ఒకదశలో సవాలుగా రూపొందింది. కాకుంటే, ఆ తిరుగుబాటుకు ఒక పటిష్టమైన కేంద్రీకృతనాయకత్వం, దేశంలోని వివిధ

ప్రాంతాల్లో పెల్లుబికిన అసంతృప్తినీ, తిరుగుబాటు ధోరణులను సమన్వయించగల నేర్పు, వ్యూహం, ఎత్తుగడలు లేనందువల్ల విఫలమైంది. అంతేకాకుండా, తిరుగుబాటుకు నాయకత్వం వహించినవారికి కానీ, చురుగ్గా పాల్గొన్న తిరుగుబాటుదార్లకుగానీ, తిరుగుబాటు సఫలమైతే, ఆ తర్వాత తీసుకురావల్సిన మార్పుల గూర్చి, భవిష్య సమాజాన్ని గూర్చి సరైన అవగాహనలేదు. ఒకవేళ సూత్రప్రాయంగావుందనుకున్నా, అది వెనుకచూపు కల్గిన భూస్వామ్య సమాజపు రూపం మాత్రమే. అందుకనే రజనీపామీదత్తులాంటి మార్క్సిస్టు చరిత్రకారులు ఈ తిరుగుబాటును, భారతదేశంలోని భూస్వామ్య శక్తులచే నాయకత్వం వహించిన, ఆఖరి అతి ముఖ్యమైన గొప్ప తిరుగుబాటుగా విశ్లేషించారు. చారిత్రకంగా చూసినపుడు, 1857లో భారతదేశంలో జాతీయతాభావం ఇంకా రూపుదిద్దుకోలేదు. ఆంగ్లపాలనా వ్యతిరేకత బాగా కొట్టొచ్చినట్లు, సమాజంలోని అన్ని వర్గాల్లోనూ ప్రతిఫలిస్తున్న- అది ఆంగ్లేయుల ఆర్థికవిధానాలవల్ల వచ్చిన భావం-జాతీయతాభావం ఒక ఉద్యమంగా ప్రజలను ఆవహించలేదు. ఆ భావం అప్పుడప్పుడే పొడసూపుతున్న పిండ రూపంలో వుంది. ఈ చారిత్రక సత్యాన్ని విస్మరించడానికి వీల్లేదు.

ఇంతకంటే ముఖ్యమైన అంశం, ఈ తిరుగుబాటువల్ల బ్రిటీష్ వలసవాద స్వభావంలోనే మార్పురావడం. ఒకసారి తిరుగుబాటు అణచివేయబడ్డాక, అందులో ప్రముఖంగా పాల్గొని, నాయకత్వం వహించిన భూస్వామ్య శక్తులతో బ్రిటీష్ వలసవాదం, దాని పాలకులు రాజీపడ్డారు. వారి రాజకీయవిస్తరణ కార్యక్రమాన్ని ఆపి రాజులను, జమీందార్లను తొలగించకుండా, తమ పాలనావ్యవస్థలో భాగస్వాముల్ని చేసుకొని, భూస్వామ్య సమాజాన్ని మార్చి, సమాజాన్ని ఆధునికీకరణ చేసే కొద్ది ప్రయత్నాలుకూడా మానుకొని, అంతకు ముందున్న సామాజికవ్యవస్థే వారికి క్షేమకరమనుకొన్నారు. తమ దేశంలో -ఇంగ్లండ్‌లో-ఏ భూస్వామ్యవ్యవస్థనయితే ధ్వంసంచేసి, పారిశ్రామికంగా సమాజాన్ని ఆధునికతవైపుకు మళ్ళించి ఒక మహత్తర చారిత్రక కర్తవ్యాన్ని నిర్వహించారో, దానికి భిన్నంగా తమ స్వప్రయోజనాలకోసం, భారతదేశంలో చరిత్ర గడియారంలోని ముల్లును వెనక్కుతిప్పారు. ఇందులో భాగంగానే 1857కు పూర్వం, వారు అనుసరించిన అభ్యుదయకరమైన సాంఘిక సంస్కరణల విధానాన్నికూడ త్యజించారు. అందుకే కారల్ మార్క్స్ ఈ సందర్భంగా, 1857 గురించి రాసిన గ్రంథంలో బ్రిటీష్‌వారిలో వచ్చిన మార్పును గర్హిస్తూ, ఆ మేరకు వారి పరిపాలనలోని నిర్మాణాత్మక **'Regenerative'** పాత్ర తగ్గిపోయిందని వ్యాఖ్యానించాడు. కాని ఈ తిరుగుబాటు భారతీయుల పోరాటపటిమనూ, త్యాగశీలతనూ, వీరోచిత స్వభావాన్నీ, నిరంకుశ అధికారాన్నీ ఎదిరించి, ఆర్థిక పీడనను నిరసించి నిర్వహించిన ఘట్టంగా అర్థం చేసుకోవాలి.

1857 తిరుగుబాటును గూర్చి తెలుసుకోవలసిన సమాచారం ఎంతోవుంది. ఆంగ్లంలో ఎన్నో గ్రంథాలున్నాయి. తెలుగులో చరిత్రపాఠ్యాంశాల్లో మినహా ఇంత ప్రముఖఘటనను గూర్చిన గ్రంథాలు రాలేదు. ఇది పెద్ద లోపం. 1857 తిరుగుబాటు నూరేండ్లు నిండిన సందర్భంగా తల్‌మిజ్ ఖల్‌దున్ రాసిన వ్యాసాన్ని అనువదించి, 1857 తిరుగుబాటులో జరిగిన ముఖ్య ఘటనల పట్టికను ఇందులో ప్రచురించడం జరుగుతున్నది . దీన్ని ఆలోచనాపరులైన తెలుగు పాఠకులు, మేధావులు, చరిత్రలో ఆసక్తికలిగిన జిజ్ఞాసుపులూ ఆదరిస్తారని విశ్వసిస్తున్నాం.

మీ
హైదరాబాద్ బుక్ ట్రస్ట్

# ఉపక్రమణిక

1857 తిరుగుబాటు చరిత్రకారులకు - భారతీయులూ, బ్రిటీషువారూ - ఎంతో ఆసక్తి కలిగించిన విషయం. బ్రిటీషు చరిత్రకారులు దానిని "సిపాయికలహం" అనిపేరు పెట్టి చులకనగా చూసారు. "పూర్తిగా దేశభక్తి రహితమూ, స్వార్థపూరితమూ" అని వర్ణించారు. దానికి "స్థానికనాయకత్వంకాని, ప్రజల తోడ్పాటుగాని లేదని" వారంటారు. మరోపక్క కొంతమంది భారతీయ రచయితలు దానిని "తొలిస్వాతంత్ర్యసంగ్రామ"మ ఉగ్గడించారు. ప్రజలంతా ఒక్కుమ్మడిగాలేచి, 'ఫరంగీ' లకు ఊపిరిసలప్పకుండా చేసి చివరికంటా పోరాడారని వారి వర్ణన. బ్రిటీషువారి వైఖరిలో సామ్రాజ్యవాదపు అహంకారం ఉన్నట్లు స్పష్టమేకాని, విమర్శ లోపించిన జాతీయవాద దృక్పథం భారతీయుల వర్ణనలో కనపడుతుంది. దాన్ని మనం గుర్తుపెట్టుకోవాలి. రెండుదృక్పథాలూ విపరీత మైనవే. వారివారి ప్రయోజనాలకు అనుకూలమైనవి మాత్రమే.

బ్రిటీషువారి దృక్పథం మరీ 'తేలిక'యింది. ఆ దృక్పథం "10 రోజుల వ్యవధి లోనే, అవధ్ ప్రాంతంలో బ్రిటీషుపాలనావ్యవస్థ కలలాగా కరిగిపోవడం, దాని చిహ్నాలు కూడా మిగలక పోవడం" ఎలాజరిగిందో వివరించజాలదు. అలాగే "అనేకచోట్ల సిపాయిలు తమకేంద్రాలలో తిరుగుబాటు చేయకముందే ప్రజలు ఉవ్వెత్తునలేవడం" ఎందువలన జరిగిందో ఆ దృక్పథం వివరించలేదు. పైగా, అది పూర్తిగా సిపాయిల దాడి మాత్రమే అయినట్లయితే, "తిరుగుబాటు చర్యలో పాల్గొన్న పౌరజనాభాను ఇంతకుమరింతకఠినంగా శిక్షించ వలిసింద"ని లార్డ్‌కానింగ్ ప్పేఅవసరమేమిటి? నాగపూర్‌లోని యూరపియను అధికారులందరినీ మట్టుపెట్టాలనుకున్న రహస్య ప్రణాళిక ఔరంగాబాద్ లో తిరుగుబాటు సమయంలోనే ఎందుకు బయటపడింది? "ప్రాగ్దిశా జంఝామారుతంవలె తిరుగుబాటు బద్దలవడం" ఎలా జరిగింది? "ఏ తాకిడినైనా తట్టుకోవడానికి భద్రంగా ఉన్నట్లు కనపడిన కంపెనీ పాలనాయంత్రాంగం వేలాది చదరపుమైళ్ళ ప్రాంతంలోకి తోసివేయబడడం, చెల్లాచెదురుకావడం" ఎందుకు జరిగింది?

రెవరెండు అలెగ్జాండర్‌డఫ్, ఛార్లస్‌బాల్... ఇంకా జాన్‌విలియమ్‌కేయే, కర్నల్ జి. బి. మెలెసన్ మొదలైనవారు- వారంతా దాన్ని 'సిపాయిల తిరుగుబాటు' అన్నవారే-

ఇచ్చిన వివరాలనుబట్టి తిరుగుబాటు విస్తృతి స్పష్టంగా తెలుస్తుంది.

డఫ్ చెప్పింది : "ధ్వంసం చేయబడకుండానూ, చెల్లా చెదురు కాకుండానూ, ఆయుధాలు స్వాధీనపరుచుకోకుండానూ ... శత్రువు వెనుదిరగడం జరగలేదు (అంటే తీవ్ర ప్రతిఘటన-సం) నిరంతరం అపజయంపాలైనప్పటికీ శత్రువు మరింత బలగంతో ఎదురయ్యేవాడు. తిరిగి కొత్త సంఘర్షణకు సిద్ధం. ఒకనగరాన్ని ఆక్రమించిన క్షణంలోగాని, మరోనగరం విముక్తం చేసినప్పుడుగాని . ఇంకోనగరానికి ప్రమాదం వాటిల్లకుండా జరగలేదు. బ్రిటీషు సైన్య ప్రవాహంవలన ఒకజిల్లా సురక్షితమైందని ప్రకటించిన సమయంలోనే మరోజిల్లా గందరగోళంలో గిలగిలలాడేది. ముఖ్యప్రదేశాల మధ్యనున్న ఒకరాజమార్గం ప్రశాంతపడిన మరుక్షణమే, మరోచోట రాకపోకలు ఒక సంవత్సరంపాటు మూతపడేవి. ఒకప్రాంతంలో తిరుగుబాటుదారులను అణచివేయగానే, మరోచోట వారు ఇబ్బడి, ముబ్బడి బలగంతో పునర్దర్శనమిచ్చేవారు. శత్రుశ్రేణుల గుండా సేనా వాహిని కదిలిపోతుండగా, వారు వెనుకనున్న ప్రాంతాన్ని తిరిగి అదుపులోకి తీసుకునేవారు. శత్రుసంఖ్యలో ఏర్పడే కొరత క్షణాల మీద నింపబడేది. శాశ్వతంగా భద్రత ఏర్పడే లక్షణం కన్పించేది కాదు. గుంపులమధ్యగా ప్రయాణంచేసే మన వీర యోధులు .. బీడుమధ్య నాగేటిచాలువలె చిహ్నాలు మిగల్చలేకపోయారు: ఆకాశంలో ఎగిరే గద్దచేసిన ఆనవాళ్ళలాగా మాత్రమే ఉండేవి. లేదంటే మహాసముద్రం మధ్యన ప్రయాణించే మహా నౌక మిగిల్చిన ఛాయలాగా ఉండేవి".

మరో బ్రిటీషు చరిత్రకారుడు ఛార్లెస్ బాల్ తిరుగుబాటుకున్న ప్రాచుర్యాన్ని ఇలా వర్ణించాడు : "అవధ్‌లో తిరుగుబాటుదార్లు ఆహారసరఫరా సౌకర్యాలేవీ లేకుండా యాత్రసాగించేవారు; ప్రజలేవారికి ఆహారం ఏర్పాటు చేసేవారు. వారి బిడారాకు కాపలా ఉండేది కాదు; ప్రజలు దానిజోలికి వెళ్లేవారుకాదు. వారికి తమపరిస్థితీ, బ్రిటీషు వారి పరిస్థితీ ఖచ్చితంగా తెలుసు; ప్రజలు వారికి సమాచారం కూర్చిపెట్టేవారు. ప్రతి బ్రిటీషు మకాంలోనూ వారికి సమాచారాన్ని చేరవేసే సానుభూతిపరులు వుండడంవలన, వారికి తెలియని రహస్యం ఉండేదికాదు. ఏదో అద్భుతం జరిగితేతప్ప వారిని సంభ్రమ పరిచే సంఘటన సాధ్యపడేదికాదు.మరోవైపున మన పదాతిదళంకంటే వేగంగా వదంతులు ప్రయాణంచేసేవి." గంగా యమునల మధ్యనున్న ప్రాంతంలో "ఇరుమతాలకు చెందిన (హిందూ, ముస్లిం-సం) వారిలో మనకు వ్యతిరేకంగా నిలబడనివాడొక్కడూ కనబడడ"ని కేయే అంగీకరించాడు. నాలుగు ఉత్తరరాష్ట్రాలలోనూ-అవధ్, రోహిల్ ఖండ్, బుందెల్ ఖండ్, సౌగార్ నర్బద - "ప్రజలలో అత్యధిక భాగం బ్రిటీషుపాలనకెదురు తిరిగింద"ని కూడా మేలెసన్ అంటాడు. "లోతైన, గాఢమైన తిరుగుబాటుకు అవధ్

కేంద్రకం ..ఎందుకంటే అది ప్రముఖంగా ప్రజలలో ప్రాచుర్యం పొందింది."—కేవ్-బ్రౌన్ అసలుతిరుగుబాటులేదని పంజాబులో కూడా..."సంపన్నుడైన వడ్డీవ్యాపారస్థుని నుండి చిన్నవ్యాపారివరకు, ప్రభుత్వపు గుత్తదారు నుండి (కంట్రాక్టర్) కూలీవరకు స్థానిక సమాజం మొత్తం నిలబడి పరికించారు: సహాయంలేదు; వస్తువుల సరఫరాలేదు." 1857 సెప్టెంబరులో ఢిల్లీ పతనమయ్యేదాకా అదే పరిస్థితి. "శిశుహంతక రాజపుత్రుడు, అంధవిశ్వాస పూరితుడైన బ్రాహ్మణుడు, మూర్ఖపు ముసల్మాను, సుఖలాలస్సుడు, పొట్ట పెంచుకున్న ఆశాపరుడుఅయిన మరాఠీ...ఈ విషయంలో ఏకమయ్యారు; గోహంతకుడు, గోపూజచేసేవాడు, వరాహవిహితుడూ, వరాహభక్షకుడూ, అల్లా ఒక్కడే, మహమ్మద్ అతని ప్రవక్త అని ఎలుగెత్తేవాడూ, బ్రహ్మరహస్యాలను గొణిగేవాడూ" ... కట్టకట్టుకుని తిరగబడ్డారు. "ఒక మామూలు తిరుగుబాటు రాజకీయకారణాలవల్ల ఉత్తరభారతంలోనూ, కేంద్రభారతంలోనూ ప్రజలలో అధికవర్గాలలో వ్యాపించి అదొక రాజకీయ సైనికపోరాటంగా మారిందనేమాటమాత్రం నిస్సందేహం"అని ఆర్. సి. దత్తు రాసాడు. ఒక్కమాటలో...1857 తిరుగుబాటు "సిపాయి కలహం" మినహా మరేమీకాదని బ్రిటీష చరిత్రకారులు పదేపదే చెప్పినమాట ..నిజంకానే కాదు. నిజానికి, తిరుగుబాటు రగిలిన కొద్దివారాల్లోనే ఉత్తరభారతంలో బ్రిటీషుసామ్రాజ్యం ఇంచుమించు అదృశ్యమైపోయింది

అలాగే, ఈ తిరుగుబాటు అప్పటివరకు బ్రిటీషువారిపై జరిగిన పోరాటాల్లోకెల్లా పెద్దదైనంతమాత్రాన దానికి స్వాతంత్ర్యసంగ్రామ స్వభావాన్ని ఆపాదించలేము. "తిరుగుబాటుచేసిన సైన్యాలనూ, తిరుగుబాటు ముఖ్యులనూ ఒక జిల్లానుంచి తరిమివేయగానే అక్కడ ప్రశాంతత నెలకొనడంలోనే" ...ఈ వక్రాణింపు (భారతస్వాతంత్ర్య సంగ్రామమని-సం)లోని అనౌచిత్యం స్పష్టంగా బోధ పడుతుంది. కాక, ఈ దృక్పథం చారిత్రకంగా కూడా పొరపాటైనది. జాతీయభావమని ఇప్పుడు మన మనుకొంటున్నట్టి భావన అప్పటి భారతీయులలో లేదు. తిరుగుబాటుకు ఒక స్పష్టమైన వ్యూహరచనగాని, తిరుగుబాటు ప్రారంభమైన తర్వాత తిరుగుబాటుదారులకు మార్గాలను సూచించే కేంద్ర వ్యవస్థగాని లేకపోవడం ...'జాతీయతాభావం' లేదనడానికిగుర్తు.బక్త్‌ఖాన్, నానాసాహిబ్, తాత్యాతోపే, ఝాన్సీరాణి, కున్వర్‌సింగ్, ఫైజాబాద్ మౌలావీ ...జరిపిన దాడులు వారివారి ప్రాంతాలకు సంబంధించిన కొన్నిహద్దులకు మాత్రమే పరిమితమయ్యాయి. తిరుగుబాటు నాయకులకూ, తిరుగుబాటు కేంద్రాలకు మధ్య చాలాస్వల్పమైన సంబంధాలు మాత్రమే ఉండేవి· ఇందుకు విరుద్ధంగా...బ్రిటీషు పాలనా యంత్రాంగం పతనమై దాన్నుంచి బయట పడ్డ తక్షణం ...ప్రాంతీయ, వర్గ ప్రయోజనాల సంఘర్షణ పొటమరించింది. ఈ ప్రయోజనాలు కొంతవరకు తిరుగుబాటు నాయకులకు చెందినవి, మరికొంత ప్రజలకు చెందినవి.

తత్ఫలితంగా బ్రిటీషు వ్యతిరేక ఐక్య సంఘటన బలహీన పడింది.

తిరుగుబాటు వ్యాప్తిచెందిన పరిమిత ప్రాంతంవల్ల కూడా, తిరుగుబాటుపై ఉన్న భారతీయ విపరీతదృక్పథాన్ని తిరస్కరించాల్సి ఉంటుంది. (స్వాతంత్ర్యసంగ్రామమనే దృక్పథం-సం) ఆ తిరుగుబాటు దేశవైశాల్యంలో ఆరోవంతుభాగాన్ని, జనాభాలో పదో వంతు భాగాన్ని మాత్రమే స్పృశించింది. అంతేకాదు, అంగీకరించడానికి సిగ్గుపడాలి కాని ..భారతీయుల ప్రత్యక్ష సహాయం వలన మాత్రమే తిరుగుబాటు అణచబడింది.

తిరుగుబాటు వాస్తవ స్వభావాన్ని అర్థం చేసుకోవడానికి, తర్వాతి భారతచరిత్రపై -సామాజిక, ఆర్థిక, రాజకీయ - దాని ప్రభావాలను అంచనావేసుకోవడానికి, మనం తిరుగుబాటును పురికొల్పిన వాస్తవ కారణాలను మదింపువేయాలి. రక్తసిక్తమైన భీభత్స చరిత్రను అధ్యయనం చేయాలి. వివిధవర్గాలపాత్రను పరిశీలించాలి. అప్పుడే, ప్రత్యేక పద్ధతి తర్కంలోనూ, స్వప్రయోజన పూరితమైన వర్ణనలలోనూ.... కూరుకుపోయిన తిరుగుబాటు గాథను రక్షించగలుగుతాం.

## కారణాలు

భారతీయప్రజలపై సామ్రాజ్యవాదుల దోపిడీ తిరుగుబాటుకు ప్రాథమిక కారణం. అందుచేత తూర్పిండియా కంపెనీ స్థాపించిన రోజులను గుర్తు తెచ్చుకోవడం అవసరమవుతుంది. పోర్చుగీసు, డచ్చి, ఫ్రెంచి కంపెనీలు భారతదేశంతో వ్యాపారంచేస్తూ విపరీతంగా లాభాలు గడిస్తున్నారనే కథలు వింటే బ్రిటీషు వ్యాపార-సాహసికులకు నోరూరింది. ఆలా లాభార్జన చేయడానికే తామూ ఒకసంస్థను పెట్టుకోవాలని భావించారు. 1600 సంవత్సరంలో భారతదేశంతోను, సుగంధదీవులతోనూ వ్యాపారం చేసుకోవడానికి బ్రిటీషురాణి ఎలిజబెత్తునుండి హక్కుల పత్రం సంపాదించింది తూర్పిండియా కంపెనీ. ఆ రోజుల్లో మనదేశంతో జరిగే వ్యాపారం పూర్తిగా మనదేశంలో తయారయ్యే హస్తకళలకూ, మిగతా విలువగల కళాత్మక ఉత్పత్తులకూ చెందిన వస్తువుల కొనుగోలుకు మాత్రమే పరిమితం. భారతీయ హస్తకళా నిపుణులకు, అంతర్జాతీయ విఫణి వీధిలో తమ ఉత్పత్తులవిలువ బొత్తిగాతెలియదు. మోసకారులైన, నీతిరహితులైన ఆ వ్యాపార-సాహసికులు విపరీతంగా లాభాలు గడించారు. 1765 వరకూ తూర్పిండియా కంపెనీ పంచిపెట్టిన లాభాలు ఏడాదికి నూరుశాతం నుంచి, 250శాతం వరకూ వుండేవి. ఆ కంపెనీ ప్రతినిధులు, సేవకులూ మన దేశంలో సొంతంగా సంపాదించిన లాభాలు ఇందులో చేరవు. కంపెనీలో పనిచేసిన చిన్న చిన్న ఉద్యోగులు కూడ తమ దేశం తిరిగి పోగానే

మహారాజుల్లాగా స్థిరపడేవారు. (Lords) వారిని 'నవాబు' అని పిలిచేవారు. దీన్నిబట్టే వారు మనదేశంలో ఎంత విపరీతంగా సంపాదించేవారో అర్థమౌతుంది.

1765లో తూర్పిండియా కంపెనీ బెంగాలులో 'దివానీ' హక్కు సంపాదించాడు. అప్పటికి 'కంపెనీ' మిగతా యూరపియను పోటీదారుల నందరినీ భారతీయ విఫణి వీధి నుండి బయటికి నెట్టేసింది. దివానీని సంపాదించడం, భారతదేశంతో జరిగే వ్యాపారంపై గుత్తపెత్తనాన్ని సంపాదించడం ..కంపెనీకీ, దాని ఉద్యోగులకూ లాభాలు ఇంకా ఎంతో పెరిగాయి; భారత ప్రజలకు దైన్యమూ, కష్టాలూ పెరిగాయి. 'దివానీ' విషయంలో ఆడమ్‌స్మిత్ ఇలా చెప్పాడు "ఏ దేశానికైనా పూర్తిగా వ్యాపారులతో కూడిన ప్రభుత్వం కంటే దుర్మార్గమైన ప్రభుత్వం మరొకటి ఉండజాలదు. తమ పాలితుల సుఖదుఃఖాల విషయంలోనూ, తమ ప్రాంతాల అభివృద్ధి లేదా వినాశనం విషయంలోనూ, పరిపాలనా సామర్థ్యం లేదా దౌర్భాగ్యం విషయంలోనూ, వారికేమాత్రం లక్ష్యం ఉండదు. ఏ పాలకుడూ అలా ఉండి ఉండక పోవచ్చును. పరిశీలించిచూడగా ఎవరూ అలా ఉండజాలరు. కంపెనీ అధిపతులున్నట్లుగా ఉండడానికి నైతికంగా అనేక కారణాలు ఎదురు నిలుస్తాయి. ఒక్కమాటలో చెప్పాలంటే పాలకులుండవలసిన స్థితిలో కంపెనీ పాలకులు లేరు. అది ఒక "ప్రత్యేక తరహా"కు చెందిన ప్రభుత్వం. దాని నిర్వహణలో భాగస్వామి ప్రతిక్షణం ఈ దేశంనుండి బయటపడటానికి తహతహలాడేవాడే. తత్ఫలితంగావీలైనంత త్వరలో వదుల్చుకు పోవాలనుకునేవాడు. ప్రభుత్వం నుంచి బయటపడ్డ మరుక్షణం బండెడు సంపదను మోసుకుపోయేవాడే. మొత్తం దేశం ఒక భూకంపంలో కప్పుకు పోయినా అలాంటి ప్రభుత్వానికి చీమకుట్టినట్టుకూడా ఉండదు."

విలియం బోల్ట్స్ ఇలా అన్నాడు: "ఈ జాతి (బ్రిటిష్) పండువంక చూస్తుంటే, కంపెనీ, దాని ప్రతినిధులు చెట్టునే నరికేస్తున్నారు.... ఇలాగే ప్రస్తుతపరిస్థితిని కొనసాగనిస్తే కంపెనీ తనను తాను నాశనం చేసుకుంటుంది. బెంగాల్లో మన ప్రాంతాలు బిచ్చమెత్తుకునే స్థాయికి దిగజారతాయి." "స్థానిక అధికారులు రైతులనుపీడించి పన్నులు అపహరిస్తారు. కంపెనీ అధికారులు అకృత్యాలకు తోడుపడటమే లాభకరమని గ్రహించారు." అని హోమ్స్ వ్యాఖ్యానించాడు

ఇలా దోపిడీ చేసిన సౌభాగ్యం ఇంగ్లండులో పోగుపడి అనివార్యమైన ఫలితాన్ని తెచ్చిపెట్టింది. ఇంకా ఇతర విధాల కూడుకున్న ధనం, ఇదీ ఏకమై ఆ దేశంలో పెట్టుబడిదారీ వ్యవస్థకు ప్రాతిపదికగా మారింది. "సంపదను యూరపుకు బయటప్రాంతాలలో ప్రత్యక్షమైన దోపిడి, బానిసీకరణ, హత్యలద్వారా పొందిన ధనం మాతృదేశానికి (సామ్రాజ్యానికి) ప్రవహించి పోగుబడ్డ సౌభాగ్యం- కేంద్రీకరణను ప్రోత్సహించడంలో

రాజ్యాంగరీత్యా నిర్మించబడినవ్యాపార సంస్థలు- శక్తివంతమైన ఉపకరణాలుగా ఉండేవి- పెట్టుబడిగా అవతారమెత్తింది" అని వ్యాఖ్యానించాడు మార్క్స్. మార్క్సుతో ఏకీభవిస్తూనే బ్రూక్స్ఆడమ్స్ కటువుగా ఇలా వ్యాఖ్యానించాడు: "జేమ్స్వాట్ ఏభయి సంవత్సరాల ముందున్నట్లయితే తానుసృష్టించిన యంత్రంతోసహా నశించివుండేవాడు-పనిజరగడానికి వసరమైన పెట్టుబడి లేనికారణాన- "వీలైనంతవరకూ ఇంగ్లండు ఉత్పత్తులను, భారతదేశ ఉత్పత్తులతో మారకం వేయరాదనీ,భారతదేశపు సరుకులను,యూరప్ సరుకులను అమ్మ వచ్చనీ" కంపెనీకి మొదట అనుమతి పత్రంలో షరతులు విధించబడ్డాయి. 1700 సంవత్సరంలోనూ, 1721లోనూ కొన్ని నిర్దిష్టమైన మినహాయింపులతో "ఇంగ్లండులో అద్దకపు గుడ్డల వాడకాన్ని-దుస్తుల విషయంలో గాని, ఏదైనా సామగ్రి విషయంలోగాని- అసలు నూలుబట్టలతో చేసిన ఏ అద్దకపు వస్తువునైనా" వాడరాదని 1700లోనూ, 1721 లోనూ పార్లమెంటు చట్టాలు చేసింది. దీనికి మినహాయింపులు నిర్దిష్టంగా స్పష్టపరచబడ్డాయి. భారతదేశం, పర్షియా, చైనాల నుండి వచ్చిన ముతక పట్టునుగాని, అద్దకపు బట్టలనుగాని వాడడం చట్టరీత్యా నేరం. అందుకు జరిమానా 200 పౌండ్ల వరకు ఉంటుంది. "భారతదేశం స్వతంత్ర రాజ్యమైనట్లైతే, ప్రతిచర్య తీసుకొని ఉండేది. బ్రిటిషు సరుకులపై నిషేధాజ్ఞలు అమలు పరిచి ఉండేది. తన ఉత్పత్తి పరిశ్రమను రక్షించుకో గలిగేది. ఈ ఆత్మ రక్షణకు అవకాశం లేదు; విదేశీ పాలకుని పాలబడింది. ఏ సుంకమూ చెల్లించ నవసరం లేని బ్రిటిషు సరుకులు దానిపై రుద్దబడ్డాయి. సమాన స్థాయిలో ఏ మాత్రం నిలవడానికి ఆస్కారంలేని సరుకులు విదేశీ పారిశ్రామికుని అన్యాయ హస్తం భారతదేశ పరిశ్రమను అణచివేసి గొంతును బిగేసింది"—జేమ్స్మిత్. తూర్పు ఇండియా కంపెనీ రాజ్య విస్తరణ దాహంవల్ల రాజ్యాలను కలుపు కుంటున్నందువలన భారతీయ సరుకులు కున్న ఒకేఒక గిరాకీ- స్థానిక సంస్థానాలు-భారత రంగంనుంచి అదృశ్యమవుతున్న క్షణాలలో ఇలా జరిగింది. విదేశీ పాలన స్థాపించబడి, విదేశీ ప్రభావం త్వరితం చేసిన ఈ క్షీణ క్రమం విదేశీ వస్తువుల పోటీతో సంపూర్తి చెందింది.

ఇంగ్లండులో పారిశ్రామిక విప్లవం పుణ్యమా అని, భారత దేశంతో ఇంగ్లండు సంబంధాల స్వభావమే పూర్తిగా మారిపోయింది. బ్రిటిషు ఉత్పత్తుల విస్తరణ ప్రాథమిక దశలోనే ఉన్న భారతీయ పరిశ్రమను కమ్మేసింది. ఈ దేశాన్ని ముడి సరుకుకు పనికివచ్చే ప్రాంతంగా మార్చింది. బ్రిటిషు సరుకులకు భారతదేశం ప్రధానమైన అంగడిగా మారిపోయింది. నిలువ నీడ లేకుండా పోయిన వృత్తి పనుల వారికీ, హస్తకళా నిపుణులకు దుర్భర పరిస్థితి ఏర్పడింది. వారి 'దైన్యానికి సమాన

మైనది ప్రపంచ వ్యాపార చరిత్రలో ఎక్కడా కనబడదని' విలియం బెంటిక్ కంపెనీ డైరక్టర్ల కోర్టుకు రాశాడు. 'భారతదేశపు మైదానాలు నేతపనివారి కల్యాలతో, తెలుపవుతున్నాయి.' అని ఆయన వర్ణన. ప్రపంచ ప్రసిద్ధి కాంచిన ఢక్కా జనాభా 1827 లో 150,000 ఉండగా, 1837 నాటికి 20,000 కు తగ్గిపోయింది.

భారతీయ సామాజిక నిర్మాణంపై ఈ వ్యాపార సంబంధాల పరివర్తన తీవ్రమైన ప్రభావాన్ని చూపింది. పనులు పోగొట్టుకున్న హస్త కళలు వారు వ్యవసాయానికి దిగారు. సామ్రాజ్యవాద సంబంధాల పరిధిలో ఆధునిక పారిశ్రామిక వ్యవస్థ ఏర్పడడం అసాధ్యం. అయితే భూమికోసం అప్పటికే ఎంతో ఒత్తిడి ఉంది; అంతకంటె మించి భరించలేదు; పురాతనమైన వ్యవసాయ పరికరాలతో నిరంతర వ్యవసాయం వీలుపడదు. ఆపైన కొత్తగా పెరిగిన భూమిశిస్తు భారం, బెంగాల్‌లో 1764-65 లో 811,000 పౌండ్లు శిస్తు 1765-66 నాటికి 1,740,000 పౌండ్లకు పెరిగింది. అది దివానీ మొదటి సంవత్సరం.

హిందూ ముస్లిం పాలకుల కాలంలో 'ప్రభువు వాటా' సంవత్సరపు ఉత్పత్తిలో భాగం మాత్రమే. పాలకునికి గానీ, అతని ప్రతినిధికి గానీ .. రైతు స్వామ్యపు గ్రామ యంత్రాంగం సమర్పించే నజరానాగా మాత్రమే దాని ప్రతిపత్తి. "భారత దేశపు భూమి తెగకు (జాతికి) లేదా దాని విభాగానికి - గ్రామ సమాజం, లేదా గ్రామంలో స్థిరపడిన గణసమూహం లేదా వంశం-చెందుతుంది. రాజ సంపదగా దాని కెప్పుడూ పరిగణన లేదు....భూస్వామ్య వ్యవస్థలోగాని, సామ్రాజ్య వ్యవస్థలో గాని, రైతులకు మినహా వేరెవరికీ భూమిపై పెత్తనం లేదు" కంపెనీ పాలనలో భూమి ప్రభుత్వానిదే నని భావించడం జరిగింది. సాంప్రదాయికంగా గ్రామీణ ప్రజలు పంటలో కొంత నిష్పత్తిని ప్రభుత్వానికి చెల్లించే పద్ధతికి బదులుగా, పండిన పంటతో నిమిత్తం లేకుండా - పండినా పండక పోయినా ఎంతపొలం సాగయిందో అనే విచక్షణ కూడా లేకుండా - నిర్ణయించిన మొత్తాన్ని చెల్లించే పద్ధతి అమలులోకి వచ్చింది. ఆ మొత్తం వ్యక్తి గతంగా రైతులు గాని, జమీందారులు గాని చెల్లించాల్సి ఉంటుంది. రైతుకే వ్యక్తిగతంగా పన్ను చెల్లించాల్సిన సందర్భంలో గ్రామ సమాజానికి ఏ కర్తవ్యమూ లేకుండా పోయింది. కొందరు రైతుల సమూహం గాని, గ్రామ సమాజం గాని, భూమికి అధిపతులుగా నిర్ణయించ బడినచోట కూడా పరిస్థితులు భిన్నం కాదు. ఎందుచేతనంటే సమష్టి బాధ్యత అనేది పేరుకు మాత్రమే మిగిలి పోయింది. వ్యక్తిగతంగా పన్నులు చెల్లించే ధోరణివైపే మొగ్గు కనబడింది. - సహ భూస్వాములు కూడ స్వతంత్ర భూస్వాముల వలెనే వ్యవహరించ బడేవారు. వారు

పొలాన్ని తాకట్టు పెట్టవచ్చు, లేదా అమ్మవచ్చు. "భూమి విషయంలో వ్యక్తిగతమైన స్వామ్యాన్ని అమలు చేయడమే మా లక్ష్యంగా ఉండేది ..పాత ప్రభుత్వాలు అలాంటి సంపదను గుర్తించనట్లే లెక్క"— జాన్‌స్ట్రాచీ.

భూమి విషయంలో వ్యక్తిగత స్వామ్యము ఋణభారానికి దారితీసింది. ఎలాగంటే, "అలాంటి హక్కు లేనప్పుడు, సాపేక్షంగా చెప్పాలంటే, అప్పు కూడా లభించేది కాదన్నమాట; అప్పు కావాలనుకున్న భూస్వామికి రక్షణగా చూపించగల సంపద ఉండేదకాదు. అందుచేత ఋణభారం తక్కువే" ఋణభారం అసాధారణం కాక పోయినా .శాశ్వతంగా భూమికి దూరం కావడమనేది లేదు; ఒక వ్యక్తికి గాని, ప్రభుత్వానికి గాని అప్పు పడ్డప్పుడు రైతుకున్న వారసత్వపు హక్కు పోవడమనేది లేదు.

కంపెనీ చట్టం అమలులోకి వచ్చినతర్వాత జమీందారు నుంచి క్రిందివరకు .. గ్రామమంతా ఋణభారంతో ఉండేది. ఋణదాతలలో వడ్డీ వ్యాపారి ఏ మాత్రం జాలి లేనివాడు. కంపెనీ చట్టం అతనికి రక్షణ కల్పించడమే కాదు; అతని అప్పులకు రక్షణగా భూమిని ఏర్పరిచింది. "గందరగోళ వ్యవహార క్రమం ద్వారానూ, కాలయాపన వలనా, వ్యయభారం వలనా అది (ఈ కొత్త న్యాయ వ్యవస్థ) వడ్డీ వ్యాపారికి తన హక్కును సృష్టించుకునే అవకాశాన్ని కలిగించింది. ఈ రకంగా అతని కేర్పడిన వసతులెన్నో. అందుచేతనే తప్పుడు కాగితాలు, దొంగ సాక్ష్యాలూ, వడ్డీ వ్యాపారి ఖాతా పుస్తకాలు - లేదా సరుకులు-తో పాటు సామాన్యమై పోయాయి"— మార్కుధారన్‌హిల్. ఆపైన వడ్డీ వ్యాపారికి అపహరించగల స్తోమతు ఏర్పడింది. స్థానికుల పాలనా కాలంలో మాదిరిగా కాక, అతడు బలవంతంగా స్వాధీనం చేసుకుంటే గాఢమైన ప్రతిచర్య జరుగుతుందనే భీతిలేకుండా పోయింది. న్యాయ వ్యవస్థలో వచ్చిన ఈ మార్పువల్ల, ఒకతరంలో ఇదివర కెన్నడూ లేనంత ఎక్కువగా భూమి చేతులు మారింది. పాత భూస్వాముల స్థానంలో కొత్త భూస్వాములు-ఎక్కువగా వడ్డీ వ్యాపారులు-రంగంలోకి వచ్చారు. 'వేలంలో పొలాలను సంపాదించే ఈ రకం ఎక్కువగా నగరాలకు చెందినవార'ని కేయే అంటాడు. వారికి తమ పెట్టుబడిపై లాభమార్జించడమే లక్ష్యం. పాత భూస్వాములైతే ఆ భూమిని అంటి పెట్టుకుని భూమిని భూమిగానే ప్రేమించిన వారు. వారికి భూమి నుంచి పొందే ప్రయోజనం ప్రధానం కాదు.

కాంపెనీ డైరక్టర్ల కోర్టుకూడా, భూమికూడా వ్యాపార వస్తువుకంటే భిన్నమైనది కాదు. ప్రభుత్వంతో ఒప్పందానికి వచ్చిన జమీందారులు తమ భాగం శిస్తును

ప్రభుత్వానికి చెల్లించకపోతే, వారి భూమిని అమ్మి వసూలు చేసుకోవచ్చునని 1776 లో చట్టం చేసారు. "ఈ పద్ధతివల్ల కనుచూపు మేర విశాలంగా భూములున్న జమీందారులు కూడా కౌలుదారుల గుడిసెల్లోకి నిష్క్రమించారు. వంట బొచ్చెలు మాత్రమే వారికి మిగిలిన ఆస్తి"—కేయే.

అయితే ఈ కొత్త వ్యవస్థలో అంతర్గతంగా కొన్ని బలహీనతలున్నాయి. తమ పాలనా ప్రాంతాల నుంచి వచ్చే ఆదాయం గురించిన స్పష్టమైన అంచనా కంపెనీకి ఎప్పుడూ ఉండదు. ఈ అనిశ్చయతను సరిచేయడానికి కారన్‌వాలిస్ కంపెనీకి ఇలా రాసాడు: (2 ఆగస్టు, 1789) "జమీందార్లను ప్రభుత్వం తరపున ప్రతినిధులుగా కాక, ఆంగ్లేయార్థంలో భూస్వాములుగానే పరిగణించి వారికి భూమిపై హక్కును ప్రసాదించడం ప్రజాహితం రీత్యా మంచిది. . ప్రస్తుతం సూచించిన ప్రణాళికా రూపం మీ ఆదాయాన్ని స్థిరపరచడమేకాక, పెంచడానికి కూడా సహాయ పడగలదు".

లార్డ్‌కారన్ వాలిస్ చిత్రించిన ఆశారేఖలు మరీ సుందరం. కంపెనీ కోర్టు ఏ మాత్రం ఆర్భాటం లేకుండా శాశ్వత శిస్తు విధానాన్ని అంగీకరించింది. బెంగాలులో శిస్తు విధానాన్ని 1793 లో శాశ్వత పరిచారు. "ఇంగ్లండులోని భూ వ్యవస్థను బెంగాలు పౌరులకు అన్వయించడానికి తీసుకున్న చర్య"గా సర్ రిచర్డ్ టెంపుల్ దీన్ని వర్ణించాడు. కాని రైతుకున్న పురాతనమైన హక్కులన్నీ "మనం ప్రసాదించిన ఈ ఆస్తి హక్కు - వారి కిదివరకలాంటి భ్రమలు లేవు - వలన దాదాపు పూర్తిగా ధ్వంసమై పోయాయ"ని లార్డ్-మెట్కాఫ్ వ్యాఖ్యానించాడు.

ఈ శాశ్వత కౌల్దారీ చట్టం వలన కూడా జమీందారీ భూములను "1845 మొదటి చట్టం ప్రకారం... చెల్లింపు జరగనప్పుడు అమ్మ వచ్చును." కారన్‌వాలిస్ తీసుకున్న చర్యవల్ల "చిన్న కౌలుదారులకు ప్రయోజనమేమీ లేదు. జమీందార్లు పునః పౌన్యంగా డబ్బు చెల్లించడంలో విఫల మవుతూ వచ్చారు; ప్రభుత్వ ప్రయోజనం కోసం వారి ఎస్టేట్లను అమ్మడం జరిగింది" అని హోమ్స్ రాసాడు. 'అమ్మకం, జప్తు ..పద్ధతి' వలన బెంగాలులో అనేక మంది జమీందారులు 'దీనాతిదీనులై భిక్షకులై పోయారు. అంతరంగిక చట్టాల ఫలితంగా మిగతాదేశాల్లో ఎక్కడా, ఎప్పుడూ జరగనంత మార్పు....బెంగాలు భూ సంబంధాలలో వచ్చింది'—1802 లో మిడ్నపూర్ కలెక్టర్ నివేదిక.

ఈ శాశ్వత కౌల్దారీ చట్ట ఫలితంగా బెంగాలులో భూమి హక్కుకూడా ముక్కలు చెక్కలుగా పంచుకోబడింది. జమీందారులు తమ పొలాలను మధ్య దళారీలకు కౌలుకిస్తే, తిరిగి వారు మరో కొందరికిచ్చారు. .. తత్ఫలితంగా ప్రభుత్వానికి,

వాస్తవంగా వ్యవసాయం చేసేవారికీ మధ్యన 'అంతరాల గొలుసు' తయారైంది. 1819లో వ్యవసాయదారులను సాక్షాత్తు జమిందారుల దయాదాక్షిణ్యాలకు వదిలిపెట్టినట్లు "పశ్చాత్తాపపూర్వకంగా అంగీకరించినప్పటికీ, రైతును రక్షించే చర్యలు మాత్రమేమీ తీసుకోబడలేదు". భూస్వామ్య విధానం, బానిస విధానం వెరోవైపునా చోటుచేసుకున్న స్వభావం బెంగాలు శిస్తు పద్ధతితో స్పష్టమవుతుంది. ఈ కొత్త సంబంధంపై థారన్‌హిల్ ఇలా సంక్షిప్తం చేశాడు: "పాతకామందులు గ్రామవాసులు; వ్యవసాయదారులు వారి కులానికే చెందినవారు, తరచు బంధువులు కూడా. వారు ఫలసాయం సంగతెలా ఉన్నా భూమిని భూమికోసమే ప్రేమించేవారు. కొత్త యాజమానుల భావాలు వేరు-వారికి భూమిపట్ల అనురక్తి ఏమాత్రం లేదు, తమ పెట్టుబడి నుంచి రాగల లాభం మాత్రమే వారు కోరుకునేది".

సర్ థామస్‌మన్రో రైత్వారీ విధానం కూడా భిన్నమైన ఫలితాలను సాధించలేదు. అదికూడా జమీందారీ విధానంలాగానే భారతీయ వ్యవస్థలను భగ్నం చేసింది. 1818లో మద్రాసు రెవెన్యూబోర్డు ఇలా రాసింది: "కొద్దిమంది విదేశీవిజేతలు .కొత్తగా ఆక్రమించుకున్న దేశాల వాస్తవమైన వనరులను గురించిగాని, భూసంబంధాల స్వభావాన్ని గురించిగాని, ఈ షణ్మాత్రమైనా పరిజ్ఞానం లేకుండానే ..భాష, జాతి, సంప్రదాయాలు, దుస్తులు, మొదలైన విషయాలలో విపరీతంగా భేదాలున్న ప్రజలు నివసించే విశాల భూభాగాల్లో అతి ప్రయాసకరమైన (**Herculean**) కార్యక్రమాన్ని- అలా అని వారను కుంటారు- మొదలు పెడతారు. అతినాగరికమైన యూరపియను దేశాల్లో కూడా ఊహాత్మకంగా భావించే కార్యక్రమాన్ని ఇక్కడ అమలుచేయడానికి ప్రయత్నిస్తారు. నాగరిక దేశాలలో గణాంక వివరాలు లభిస్తాయి, ప్రజలకూ ప్రభుత్వానికీ సన్నిహిత సంబంధాలుంటాయి. ఉదాహరణకు అక్కడ ఒక రాష్ట్రానికో, జిల్లాకో, మండలానికో లేదా ఒకో ఎస్టేటుకో, వ్యవసాయక్షేత్రానికో మాత్రమేకాక....ఆ దేశంలోని ప్రతి విడిపొలానికి. .. భూమిశిస్తు మదింపుచేసే అవకాశంపుంది.

ఈ భావనాత్మకమైన అభివృద్ధికై జరిగే పాకులాటలో, అనుకోకుండానే పాత బంధాలన్నింటినీ భగ్నపరుస్తారు. భారతీయ గ్రామ రాజ్యాలను బంధించే సంప్రదాయాలు; ఏదో వ్యావసాయిక సూత్రంద్వారా శిస్తులను నిర్ణయించి, భూమిని విభజించే పద్ధతి; ఆ భూమి తరతరాలుగా గ్రామీణ సమాజానికి సమష్టి ఆస్తి; ప్రతి ముక్కకూ చెక్కకూ ప్రత్యేకత కలిగిస్తున్నామని చెపుతూ హద్దులూ, అసాధ్యమైన పరిమితినీ నిర్ణయిస్తారు. రైతుపై విచక్షణారహితంగా పన్నులువేస్తారు. అంతకు ముందరి ముసల్మాను ప్రభువుల వలెనే "ఎక్కువ శిస్తు విధించబడిన భూమికి రైతునుకట్టివేసి సాగు చేయిస్తారు. పారిపోతే

ఆ శిస్తును తాత్కాలికంగా వాయిదావేసి తిరిగి లాక్కొచ్చి వ్యవసాయం చేయిస్తారు. పంట చేతికి రాగానే అంతా గోళ్ళూడగొట్టి వసూలుచేసి .. అతనికి జత ఎద్దులూ, విత్త నపు గింజలూ మాత్రమే మిగులుస్తారు. అది కాదేమో . ఎద్దులనూ, విత్తనాలనూ కూడా సమకూర్చిపెట్టి విషాదభారమైన వ్యవసాయాన్ని తనకోసంకాక,తమకోసం కొన సాగించేటట్లు చూస్తారు."

1800-1814 సంవత్సరాల మధ్యకాలంలో కంపెనీకి గణాంక వివరాలు సేకరించిపెట్టిన డాక్టర్ ఫ్రాన్సిస్ బుచానన్: "ఈ దేశస్తులు వారు ప్రస్తుతం చెల్లిస్తున్న దానిలో సగంకూడా (మొగల్ పాలకులకు) చెల్లించలేద"ని చెప్పారని నివేదించాడు. కంపెనీ పరిపాలిత ప్రాంతాలలోని రైతాంగం 'ఘోరమైన పరిస్థితిలో ఉన్నారు, స్థానిక పాలకులక్రింద నున్న రైతులకంటే దరిద్రంగా, నిరాశగా ' ఉన్నారని బిషప్ హెబర్ (1830) రాసాడు. 'మనం వసూలుచేసే శిస్తును .. ఏ స్థానిక పాలకుడూ అడగడనేది వాస్తవం'—హెబర్.

బెంగాల్, బీహార్, ఒరిస్సాలలో దోపిడిచేయడం ద్వారా పోగుచేసిన సంపద కంపెనీకి మరింత ఆశ కలిగించింది. తమ పాలిత ప్రాంతాన్ని విస్తృతం చేయడానికి అదే ప్రేరణ. ప్లాసీయుద్ధానికీ, తిరుగుబాటు కాలానికీ మధ్య కంపెనీ 20 యుద్ధాలు సాగిం చింది. నూరు సంవత్సరాల కాలంలో మైసూరు, మహారాష్ట్ర, కర్ణాటక, తంజావూరు, బుందెల్‌ఖండ్, రోహిల్‌ఖండ్, హరియానా, పంజాబు (దేశవిభజనకు పూర్వపు వాయువ్య రాష్ట్రంతో సహా) అవధ్. .. ఇవన్నీ కంపెనీ రాజ్యంలో భాగాలయ్యాయి. పూర్వపు స్వదేశ రాజ్యాలన్నీ- కాశ్మీరునుంచి కొచ్చిను దాకా- కంపెనీ 'రక్షిత ప్రాంతాలు' అయ్యాయి. కంపెనీ సైనికులను ఎక్కువగా బాధించిన విషయం డల్హౌసీ అవధ్‌న స్వాధీనం చేసుకోవడం (1856)—"కంపెనీ సైనికులలో ఎక్కువ మందికి (నాల్గింట మూడు వంతులు) అవి జన్మభూమి" (వాస్తవానికి 18వ శతాబ్దపుమధ్య నుంచీ అవధ్ ద్వంద ప్రభుత్వ పద్ధతిలో పాలించబడుతోంది.) "అవధ్‌కు చెందినవారేకాక, ఉత్తర భారతం మొత్తంలో ఉన్న ముసల్మాను లందరకూ ...ఉన్న కొద్ది మహమ్మదీయ పాల వంశాలలో ఒకదాన్ని అణచివేయడం క్రోధం, ద్వేషం కలిగించింది"--లెఫ్టనెంట్ జనరల్ మెక్ లాయిడ్స్ ఇన్నెస్.

ఆ నగరంలో ఉన్న 6,7 వేలమంది ప్రజలు పాత పాలకుల దుష్టవర్తనపై ఆధారపడి బ్రతికేవారు. అలాగే వారి దర్జాలకూ, లాలసతకూ ... అవసరమైనవి సమ కూర్చి బతికేవారు వ్యాపారులు. ఇద్దరికీ బ్రతుకు తెరువు పోయింది. అలాగే రాజాస్థా నపు క్షీణాభిరుచుల కవసరమైనవి సమకూర్చే మరికొద్ది మందికికూడా ఉపాధి పోయింది

సంపన్నమైన దుస్తులు, సుందరమైన తలపాగాలు, అద్భుతంగా అలంకరించబడ్డ పాద రక్షలు, ఇంకా అనేక ఉప వృత్తిపనులు . తమ వస్తువులకు గిరాకీ హఠాత్తుగా నశించ డంతో తీవ్రంగా ...దెబ్బతిన్నాయి. రాజాస్థానపు పోషణ అదృశ్యమైనందు వలన సంభ వించిన ఫలితాలను సమీక్షిస్తూ యల్.ఇ రూట్జ్ రీస్: "రాజుగారి కాలాన పెద్ద పెద్ద పద వులాక్రమించిన కులీనులు, పెద్దమనుషులు, రాజోద్యోగులు-పని చేయడానికి బద్ధకస్థులు- ప్రస్తుతం దురవస్థ నెదుర్కొంటున్నారు. గుంపుల కొలదిగా వారి కొలువు చేస్తున్న జీతగాళ్ళు, నౌకర్లు నిరుద్యోగులయ్యారు . స్థానిక రాజపాలనలో నగరమంతా ముసురు కొని తిని తిరిగిస అనేకమంది తిరుగుబోతులు, సాహసికులు, బిచ్చగాళ్ళు మన పాల నలో ఆకలి పాలయ్యారు. వజిద్ఆలీ గద్దెపైనున్నప్పుడు రాజుగారికీ, ఆస్థాన సభికు లకూ, రాణివాసంలోని సంపన్న నారీజనాలకు .. అవసరమైన విలాసవస్తువుల ద్వారా విపరీతంగా సంపాదించుకునే వణిజులు, కొట్లివారు, బ్యాంకర్లు .. గిరాకీ కోల్పోయారు; ఇంచుమించు ప్రజానీకమంతా . ముఖ్యంగా పేదవారు అసంతృప్తికి లోనయ్యారు. ఎందుచేతనంటే వారిపై ప్రత్యక్షంగాను, పరోక్షంగాను పన్నులు పడుతున్నాయి".

అందరికంటే ఎక్కువగా బాధపడ్డవారు తాలూక్దార్లవర్గం. అవధ్ నవాబ్ వజీర్ బలహీనమైన పాలకుడైనందువలన అతని ప్రమేయం లేకుండానే తాలూక్దార్లు అధికారం చలాయించేవారు; తుపాకి చూపించి శిస్తు పిండేవారు; ప్రాణాలను, సంపదను, పరిశ్రమ లను రక్షణారాహిత్యంచేసి ప్రభుత్వాన్ని అస్థిర స్థితిలో ఉంచేవారు. "ఏ కారణంవల్ల నైనా (వారు) ఒకరితో ఒకరు తగాదా పడినప్పుడు, లేదా స్థానిక ప్రభుత్వంతో తగాదా పడ్డప్పుడు విచక్షణా రహితంగా దోపిళ్లు, హత్యలు సాగించేవారు- తమ వర్గానికి చెందని వారి భూములపై స్వైరవిహారం చేసేవారు- రోడ్డు, బస్తీ, గ్రామం, పల్లె.... దేనికీ వారి క్రూరమైన దాడులనుండి రక్షణ లేదు. బందిపోటు తనం, ఖూనీ .. వారికి ఒక సరదా, ఒకక్రీడ; వారినేమాత్రం రెచ్చగొట్టని స్త్రీలు, పురుషులు బాలురు మొదలైనవారి ప్రాణాలు లేక్క, అడవిపందుల ప్రాణాలకంటే ఎక్కువకాదు"—స్లీమన్. తాలూక్దార్ల ప్ర మేయం లేనిచోట కూడా వారి ఆశపోతు, దుర్మార్గపు అధికార్ల-అమీల్సు- దౌష్ట్యాలపాలై వందల కొలదీ గ్రామాలు ధ్వంసమయ్యాయి, నిర్మానుష్యమయ్యాయి. వారి దుర్మా ర్గాలకు సాక్ష్యంగా పశువులు బక్కచిక్కిపోయి, వ్యవసాయ సామగ్రినికూడా ఈడ్చలేక పోయేవి. బిక్కుబిక్కుమంటూ నిర్మానుష్యమైన గ్రామాలు, చెడిపోయిననూతులు, నగ్నమై మలమల మాడుతున్న రైతాంగం ...వారి దుర్మార్గానికి "ఉచితమైన దాఖలాగా మిగిలిపోయాయి". "అవధ్ ప్రాంతంలో కనబడినంత దారిద్ర్య స్వరూపం ఇంతకు ముందు నేనెక్కడా చూసి ఎరుగను" అని అప్పటి అవధ్ న్యాయశాఖా కమిషనర్

యం. ఆర్ గబ్బిన్స్ అన్నారు. అవధ్‌ను కంపెని తన రాజ్యంలో కలుపుకునే ముందున్నప్పుడున్న రైతాంగ స్థితిని వర్ణిస్తూ కేయే ఇలా అన్నాడు: "అక్రమపాలనా దౌష్ట్యాలు ఇంతకుముందెప్పుడూ, ఎక్కడా ఇంత ఘోరంగా కనిపించలేదు, దుర్మార్గమైన ప్రభుత్వపు దుర్మార్గాలు ఇట్టి దీనావస్థను సృష్టించడం మునుపెప్పుడూ కనీ వినీ ఎరుగం."

ఉన్నతవర్గాల సంపూర్ణ ప్రయోజకత్వం కంపెనీ ఒక వాస్తవంగా ముందే పసిగట్టింది. భూసంపద కలిగిన ఉన్నత వర్గాలను మట్టు పెట్టడం, అవధ్ ప్రజలకు ఎనలేని ప్రయోజనం చేకూరుస్తుందని కంపెనీ ఉద్యోగులు నిర్ణయానికి వచ్చారు. ఈ లక్ష్యాన్ని దృష్టిలో పెట్టుకునే, భూస్వాముల హక్కు పత్రాలు, ఒప్పందాలు మొదలైన విషయాలను పరిశీలించడానికి ఇనామ్ కమిషన్ ఏర్పాటైంది. తిరుగుబాటుకు ముందు 5 సంవత్సరాల కాల పరిమితిలో, 35,000 జమీందారీలలోను, 21,000కు పైగా రద్దు చేయబడ్డాయి.

ఇనామ్ కమిషన్ చర్యలను 'క్షౌరశాల' చేసే క్రియలుగా వర్ణించాడు జి.బి సెటన్ కార్. ఆయన ఇలా రాసాడు: "ప్రతిరోజూ "బలిపశువుల" జాబితా తయారవుతుంది; ఏ పని చేయడమూ చేతకాక, అన్నీ క్షవరమై బిక్షమెత్తడానికి వెరచి సిగ్గుతో తల వాలిపోయినవారికి. . ఎవరైనా అదృష్టవంతులు ఈ శిక్షను తప్పించుకోవడం మరింత బాధ కలిగించేది" కమిషన్ నిర్ణయాలను "జప్తుచర్యల" ని థారన్‌హిల్ సూత్రీకరించాడు.

ఎన్నో సంవత్సరాలుగా వారసత్వం పుణ్యాన భూముల యాజమాన్యం కలవారు -తమ భూమి హక్కుపై నలుసంతకూడా సందేహంలేని కుటుంబాలవారు- హటాత్తుగా అన్నీ కోల్పోయి బజారుపాలయ్యారు. ఈ విధంగా "ఆంగ్లేయ (చట్టపు) అన్వయం వలన నెమ్మదిగా ఒక విప్లవం వచ్చేసింది. దానికి మరికొన్ని ప్రభావాలు తోడై, అసంతృప్తి చెందిన ప్రమాదకరవర్గాల సంఖ్య విపరీతంగా పెరిగింది. ఆ వర్గాలు తమ పతనానికి బ్రిటిషు పాలనా కార్యకలాపాలు ముఖ్య కారణమని ఊహించారు. అందుచేత ఏదో నూతన విప్లవ శంఖం వచ్చినప్పుడు, తాము కోల్పోయిన వాటిని తిరిగి సాధించగలమనే ఆశతో క్రోధంగా కాలం గడుపుతున్నారు"—కేయే.

కంపెనీవారు ఊహించినట్లు జరగలేదు. దీనంతటినుంచి వాస్తవంగా భూమిని దున్నేవానికి ప్రయోజనం లభించలేదు. కొత్త ఆక్రమణవలన లభించే అధిక లాభాలను అంచనావేసి పట్టిక తయారుచేసారు కంపెనీ ఉద్యోగులు. మొత్తం వసూళ్లను పెంచడానికిగాను, శిస్తురేటును పెంచారు. అనేక జిల్లాలలో ప్రభుత్వపు 'విధింపు' ఒత్తిడి "ఎంతగానో ఎక్కువ'' అని గబ్బిన్స్ కూడా అంగీకరించక తప్పలేదు. శిస్తు మదింపు విధానాన్ని "క్రూరమైనది"గా వర్ణించాడు థారన్‌హిల్. ఆయనిలారాసాడు: "భూమిశిస్తును

మనం చాలా ఎక్కువగానే నిర్ణయించాం. ఆ శిస్తు చెల్లింపుకై మనం పెట్టే ఒత్తిడి -అంటే భూమిని అమ్మేట్లుగాచేసే ఒత్తిడి-మరింత బాధాకరంగా పరిణమించింది. వడ్డీ వ్యాపారుల దుర్మార్గాలకు సహకరించే మన చట్టపద్ధతిపై, మన ప్రభుత్వపు బలాత్కార విధానంపై ద్వేషాన్ని సృష్టించింది." సర్ సయ్యద్ అహమద్ ఖాన్‌ను ఎవరూ బ్రిటిషు వ్యతిరేకి అని అనజాలరు. 'భారతీయ- తిరుగుబాటుకు కారణాలు' అన్న కరపత్రంలో ఆయనకూడా ఇలా వ్యాఖ్యానించాడు: "ఆంగ్లేయ ప్రభుత్వం ప్రవేశపెట్టిన శిస్తు విధానం నిస్సందేహంగా శ్లాఘపాత్రం. కాని శిస్తు విలువమాత్రం-పూర్వపు విలువలతోపోలిస్తే- చాలా అధికం. అనేకానేకాంశాలను పరిగణనలోకి తీసుకోకుండా ప్రభుత్వం ఈ శిస్తులను నిర్ణయించింది. బీడుగా ఉన్న భూమికీ, సాగైన భూమికీ ఒకేరకం శిస్తు . రైతులు శిస్తులు చెల్లించడానికే అప్పులు చేయాల్సి వచ్చింది. దానిమీద వడ్డీ ఎంతో ఎక్కువ." ఆంగ్లేయ ప్రభుత్వం విధించినకోర్టుల ఆజ్ఞానుసారం అప్పుకు బదులుగా అనేకమయిన జమీందారీలను ప్రతిసంవత్సరం వేలం వేసేవారు. ఒకోసందర్భంలో ఆ బాకీ రెండు రూపాయలకంటే ఎక్కువ ఉండేది కాదు. క్రింది రాష్ట్రాలనుంచి వచ్చిన కొత్త మనుషులు ఆ జమిందారీలను కొంటుండేవారు. ఇదివరకటి జమీందార్లు-ఇప్పటికీ ఆ ప్రాంతానికి చెందినవారు-చిన్న రైతులుగా, కౌలుదార్లుగా తమ వారసత్వ భూముల్లోనే పనిచేసేవారు. 'భారతీయ సమాజం తలక్రిందులై పోయిందని' అసంఖ్యాకంగా జరిగిపోయిన ఈ జమీందారీ అమ్మకాలను గురించి సర్ సయ్యద్ అహమద్ ఖాన్ వర్ణించాడు.

అప్పటికే పేదరికం భారంతో బతుకుతున్న ప్రజలపై, భారతీయ సంప్రదాయానికీ, అలవాట్లకూ విరుద్ధమైన, న్యాయసంబంధమైన పన్నుపత్రాలు ప్రవేశపెట్టటం వలన మరిన్ని బాధలుకలిగాయి. ఆపైన న్యాయనిర్వహణకు ఇదంతా అవరోధమై కూర్చుంది. అంతకుపైన, నల్లమందుపై సుంకం విధించబడింది. పేదప్రజలకు ఇది మరింత ఆగ్రహాన్ని కలగజేసింది. అందుచేత ఇప్పుడు "దరఖాస్తులమీద, తిండిమీద, ఇళ్లమీద, తిను బండారాలమీద, ఏరు దాటించే పడవలమీద" పన్ను వచ్చింది. "నల్లమందు గుత్తదారు, ధాన్యాలు, నిత్యావసరవస్తువులు ..వీటికొక గుత్తదారు, ఉప్పుకూ, సారాయికీ ఒక గుత్తదారు ఇలా రకరకాలుగా గుత్తదార్లు బయలుదేరారు. వాస్తవానికి పారిస్‌లో ఆక్ట్రాయి అని పిలిచే ప్రతివస్తువు పన్నుకూ ఒక గుత్తదారు ఏర్పడ్డాడు. ఆహారరూపంలో ఉన్న ప్రతి వస్తువూ ప్రియమయి పోయింది గుత్తదార్లకు ..సంపద పోగు పడుతోంది. మరోవైపున వారి బలాత్కారపు వసూళ్లవలన ప్రజలు నానా ఇబ్బందుల పాలయ్యారు."

రెసిడెంటురో అంచనా ప్రకారం అవధ్ రాజ్యంలో తొలగింపబడిన సిపాయిల సంఖ్య 70,000కు మించుతుంది. వారంతా అవధ్ మీదపడి విచ్చలవిడిగా తిరిగే దుండ

గీళ్ళుగా మారిపోయారు. "సిపాయిని తొలగించడమంటే దోపిడిదొంగను సృష్టించినట్లే" అని లెఫ్టినెంట్ జనరల్ ఇన్నిస్ వ్యాఖ్యానించాడు. అవధ్‌లో ఒకరైనా సిపాయి ఉద్యోగం చెయ్యని కుటుంబమొక్కటైనా ఉండేది కాదు. నూతన అవధ్ సైన్యంలో-అదీ క్రమమయిన సైన్యం కాదు-చోటులేని అసంఖ్యాకమయిన పాత సైనికులతో ఆ ప్రాంతమంతా నిండిపోయింది. ప్రతి అవధ్ రైతు కుటుంబంలోనూ ఈ విధంగా- సైన్యంనుంచి తొలగింపు వలన-నిరుద్యోగం చోటు చేసుకుంది.

ఈ సైన్య వర్గానికి- అప్పటివరకు అభిమాన పాత్రవర్గం- అవధ్‌ను కంపెనీ రాజ్యంలో కలిపివేయడం అనే మరో కారణం వలనకూడా క్రోధం కలిగించింది. "సిపాయిల మాతృ ప్రదేశం, పింఛనుదారుల స్వర్గం ఇక ఏమాత్రం పన్నుల నుంచి తప్పించుకోజాలదు". ఇందు మూలంగా "శిస్తుపద్ధతివలన వచ్చిన కష్టాలకు వ్యతిరేకంగా కంపెనీ ఆక్రమణకూ, తిరుగుబాటుకూమధ్య కాలంలో ఈ ప్రాంతానికి చెందిన 75,000 మంది సిపాయిలనుంచి 14,000 దరఖాస్తులు పెట్టబడ్డాయి." ఆ సిపాయిలలో 25,000 మంది బ్రాహ్మణులు. ధర్మ సంస్థలకు చెందిన భూములను స్వాధీనం చేసుకున్నందువల్ల వారికి (బ్రాహ్మణులకు) రెట్టింపు బాధ కలిగింది. సౌకర్యమయిన ఆదాయాన్ని అడ్డుకోవడం వలన వారు "ప్రజల అసంతృప్తిని రెచ్చ కొట్టడానికి, ప్రజల మనస్సులలో మతభీతి అనే విషాన్ని నింపడానికి ఇతరులపై తమకున్న ప్రభావాన్ని మరల్చారు."

అవధ్‌ను కలుపుకోవడం వలన పుట్టుకొచ్చిన పరిస్థితిని మేలెసన్ అద్భుతంగా సంగ్రహపరిచాడు: "అవధ్‌ను తమ రాజ్యంలో కలుపుకోవడంవలన . . స్థానిక సంస్థానాధీశులు దూరమయ్యారు. వారికి ఆ చర్యలో తృప్తిలేని అధికార దాహం కనబడింది. అందుకు బదులుగా మొక్కపోని ప్రభుభక్తిగాని, సమయానుకూలంగా సమర్పించే పణాలు గాని సరిపోవని వారు నిర్ణయానికి వచ్చారు. కొత్తగా ప్రవేశ పెట్టబడిన బ్రిటిషు వ్యవస్థవలన సగమో అంతకంటే ఎక్కువో . . ఆస్తులను పోగొట్టుకున్న ప్రాంతీయ కులీన వర్గాన్నికూడా ఈ చర్య-అవధ్‌ను కలుపుకొనడం- దూరం చేసింది. తమ ప్రభువు దయాదాక్షిణ్యాల వలన ఉద్యోగ సద్యోగాలను అనుభవిస్తున్న మహమ్మదీయ ఉన్నతవర్గం తమ సౌకర్యాలను కోల్పోవడంతో, బ్రిటిషువారికి దూరమయ్యారు. అదే విధంగా అవధ్‌నుంచి సైన్యంలో చేరిన సిపాయిలు బ్రిటిషువారికి దూరమయ్యారు. వారి ప్రాంతం స్వతంత్రంగా ఉన్నంతకాలం వారికి బ్రిటిషు రెసిడెంటు సమర్పించిన దరఖాస్తుల వలన లక్నో న్యాయపీఠం అవధ్‌పై వారికి (ఆ సిపాయిలకు) ప్రత్యేక హక్కులుండేవి. తద్వారా వారు తమ కుటుంబాలను పీడననుంచి రక్షించుకునేవారు. ఇప్పుడది పోయింది. ఇకపోతే రైతాంగం, పట్టణ వృత్తినిపుణుల సంగతి. అప్పటివరకూ ఉన్న

వ్యవస్థ నిరంకుశమైనదీ, ఇష్టాయిష్టాలపై ఆధారపడిందనీ తెలిసినా, దానికి బదులుగా ప్రవేశ పెట్టబడిన వ్యవస్థలో మొదట దర్శనమిచ్చింది నిత్యావసర వస్తువులపై పన్నులు కనక . ఈ వర్గపు ప్రజలుకూడా బ్రిటీషు వారికి దూరమే అయిపోయారు. ఒక్కమాట లోచెప్పాలంటే ప్రభుభక్తికి మారుపేరైన ప్రజలున్న అవధ్ ప్రాంతం కంపెనీ రాజ్యంలో కలుసుకున్నందువల్ల ఆ ప్రాంతం అసంతృప్తికీ, కుట్రకూ, ఆలవాలమై పోయింది.

ఆపైన అధికమైన వేతనాలనుంచి, ఉన్నతోద్యోగాలనుంచీ భారతీయులను దూరంగా ఉంచడం అనే అసంతృప్తి ఉండనే ఉండి, ఈ ప్రత్యేక స్థితి హిందువులకంటే, మహమ్మదీయుల కెక్కువ కష్టం కలిగించింది. హిందువులు సామాన్యంగా ఉద్యోగాలు చేసేవారు కాదు . తమ తండ్రి తాతల వృత్తులలోనే వారు కొనసాగేవారు. బాల బ్రాహ్మణులు సంప్రదాయబద్ధులై ఉద్యోగాలుచేసేవారుకాదు; వైశ్యులు వ్యాపారస్తులు, బ్యాంకర్లు. క్షత్రియులు ఒకనాడు దేశ పాలకులు, ఏదో కొంత భూమిని అదుపులో పెట్టుకొని అధికార రూపాన్ని కొనసాగిస్తున్నారు. ఇక హిందువులలో ఒక భాగం- కాయస్థులు- మాత్రమే ఉద్యోగాలు చేసి కాలక్షేపం చేస్తున్నారు.

ఇందుకు భిన్నంగా, ముస్లిములు ఎక్కువగా ఉద్యోగాలపైనే ఆధారపడేవారు. కంపెనీ పాలనకు ముందు, వారు ముస్లిం ప్రభుత్వాలలో గౌరవనీయమైన పదవులలో ఉండేవారు. అలాంటి పదవులనే ఇప్పుడూ ఆశించారు. కాని కంపెనీ పాలన క్రింద వారికా పదవులు దక్కలేదు. కంపెనీ సైన్యంలో లభించగల సిపాయి లాంటి పదవులు లభ్యమైనా, వారికి బొత్తిగా ఇష్టం లేదు. ఈ అయిష్టతకు కారణం తేలికగా ఊహించదగ్గదే; వారి ప్రభుత్వాలలో వారికి అత్యున్నతమైన పౌర, సైనిక ఉద్యోగాలు లభించేవి. అందుకుగాను వారికి లభించే వేతనాలు కంపెనీ యూరపియను ఉద్యోగులకు వచ్చే జీతాలకంటే తక్కువైనవి కావు. సైనికాధికారులుగా వారిలో కొందరికి వచ్చే వేతనం నెలసరి వెయ్యిరూపాయలు; ప్రస్తుతం వారికొడుకులకు మహావస్తే 80 రూపాయలు — అదికూడా అదృష్టవశాత్తూ వారికి రిసాల్‌దారు పదవి లభించినప్పటిమాట. "స్థానికులను హీనపరిచి భిక్షకులుగా మార్చి శత్రువులుగా చేసుకోవడం" అని వెల్లింగ్టన్ ప్రభువు వ్యాఖ్యానించినపుడు ఈ విషయం ఆయన మనసులో ఉండి ఉండాలి. ఈ విధానం "ప్రజలందరినీ కించపరిచింది" నడం ద్వారా సర్ థామస్ మన్రో ఈ విషయాన్ని స్పష్టం చేసాడు.

ఇదివరకటి ప్రభుత్వాల్లో భారతీయులు పెద్ద పరివారాన్ని పోషించేవారు; ఇప్పుడవకాశమొస్తే అలాగే పోషిస్తారు; కాని ఆయా పెద్ద ఉద్యోగాలలో ఉన్న యూరపియ

నులు అలాంటి పరివారాన్ని ఉంచుకునేవారుకాదు, ఉంచుకోవడానికి అవకాశం కూడా లేదు. ఆవిధంగా పేద తరగతులకు చెందిన భారతీయులకు, వారిని పాలించే ప్రభుత్వ మేదైనప్పటికీ అలాంటి ఉద్యోగాలు వచ్చే అవకాశం లేదు. దీని ఫలితమేమిటంటే ఏ కల్లోలం రేచినా తమ పరిస్థితులు మెరుగవుతాయనే ఆశతో దాన్లో పాల్గొనడానికి వారు సిద్ధంగా ఉన్నారు. నిజానికి అత్యాశ్చర్యకరమైన కూలి(రోజుకు అణా లేదా అణన్నర) కోసం వారు తిరుగుబాటుదారుల వైపు పనిచేసారు. చాలామంది పైకానికి బదులుగా 2 శేర్లు లేదా శేరున్నర ధాన్యం రోజుకూలీగా తీసుకున్నారు.

ఒకవైపున "ధార్మిక సంస్థల స్వాధీనం . . పురాతన ముసల్మాను కుటుంబా లను తీవ్రంగా బాధపెట్టి, నిరసనను రెచ్చగొట్టి, రాజద్రోహానికి సిద్ధపరిచాయి." మరోవైపున ఆంగ్ల భాష పాశ్చాత్య సాహిత్యం, విజ్ఞానశాస్త్రం మొదలైనవాటి ప్రాధా న్యతపై ఆధారపడ్డ నూతన విద్యావిధానం ముస్లిం విద్యాధికులను స్వల్పం చేసింది. "మన విద్యా సంస్కరణల ధోరణి, సర్వపరివ్యాపక ఆంగ్లేయతా విధానం దేశాన్ని చుట్టుముట్టగా. . మహమ్మదీయత స్థాయిని చులకన పరచడానికి, అసహిష్ణులైన అనేక మంది ప్రముఖ మహమ్మదీయులకు వేతనాలు దక్కనీయకుండా చేయడానికే" ఉపయోగ పడిందని కేయే అంగీకరించాడు. న్యాయస్థానాల్లో పర్షియన్ భాషను రద్దు పరచడం, ప్రభుత్వోద్యోగాలకు పరీక్షలద్వారా ఎన్నికచేయడం కూడా, ముస్లిముల ఉద్యోగావకాశా లను-పూర్తిగా నాశనం చేయకపోయినా-తగ్గించివేశాయి.

లోవె ఈ విషయాన్ని సంగ్రహంగా ఇలాచెప్పాడు: "ఈ దేశపు వనరులు అభివృద్ధి పరచబడకపోగా, వేయి సంవత్సరాల క్రితం ఎలాఉన్నవో అలాగే ఉంచ బడ్డాయి(లేదా నశింపుచేయబడ్డాయి) అనేమాట మాత్రం స్పష్టమే; పాశ్చాత్య ప్రపం చంలో భారతదేశపు ఖ్యాతిని పెంచి ఆశ్చర్యాన్ని కలగజేసే స్థానిక ఉత్పత్తులు, కళలు . ఇప్పుడు ఇంచుమించు అంత్యదశను చేరుకున్నాయి; ఒకనాడు ప్రసిద్ధి చెందిన పెద్ద పట్టణాలు ఈనాడు కేవలం శిధిలసమూహాలు — నక్కలకు, దుమ్ముల గొండ్లకూ ఆవాసస్థానాలయ్యాయి; దాని కళాశాలలు ఇప్పుడు లేనేలేవు— ప్రాచ్య దేశపు వివేకవంతులు కట్టుకథల్లోనూ, పాతచరిత్రల్లోనూ మాత్రమే మిగిలిపోయారు; దాని దేవాలయాలు, అద్భుతమైన అజంతా, ఎల్లోరా గుహలు మొదలైన ప్రదేశాలు అతివేగంగా మట్టిపాలైపోతున్నాయి; బాహుశా కొంతకాలానికి వాటి ఛాయలుకూడా మిగలకపోవచ్చును; దాని తటాకాలు, విడాదు సత్రములు నాశనమౌతున్నాయి, అయ్యాయి; వ్యవసాయానుకూలమైన కాలువలు మట్టితో కప్పుపడి, విస్మృతమై పోయాయి; జిల్లాలకు జిల్లాలు నిర్మానుష్యం కాగా అరణ్యాలు, అడవి జంతువులూ

వాటి స్థానాన్నాక్రమించాయి. ఘోరమైన మలేరియా ఆవరించింది. నాశనం, నాశనం, దారిద్ర్యం ఈ భూమిని కుష్ఠురోగం స్పృశించినట్లుగా నాశనం కాపడానికి త్వర పడుతోంది మనం ఒకవైపున ఇలాంటి మహాదేశంలోని వనరులను ఇంచుమించు అలక్ష్యం చేస్తూ, మరోవైపున మనదేశపు పారిశ్రామిక పట్టణాల చెత్తను ఈ దేశపు మారుమూలలలో ప్రవేశపెట్టామని కళ్ళు చెవులూ ఉన్నవాడెవడైనా క్షణంలో గ్రహిస్తాడు. ప్రాచ్య ప్రాంతపు సరకుల సహజ ప్రయోజనకరమైన ఉత్పత్తిని ధ్వంసం చేయడానికే మనం కంకణంకట్టుకున్నట్లుగా కనబడుతుంది." రోవె ఇలా అడుగుతాడు "అలాంటి అపసవ్య విధానాన్ని కొనసాగిస్తే అలాంటి హ్రస్వదృష్టికి ఫలితమేమిటి?"

ఈ తీవ్రమైన వేదన మధ్య, విపరీతమైన దరల పతనంతో కలిసివచ్చిన దీర్ఘ కాలిక ఆర్థిక మాంద్యం (1825-1854) ఘోరమైన ఆర్థిక, రాజకీయ, సామాజిక పరిస్థితులను సృష్టించింది. 1850లో ప్రపంచంలో ఉన్న గిరాకీ కంటే ఎంతో తక్కువ వెండి ఉత్పత్తి జరిగింది. ఇది పరిస్థితిని మరింత విషమం చేసింది— మొదటిది : 1835 చట్టప్రకారం భారతదేశపు ద్రవ్యపు చలామణీ వెండితో ముడిపెట్ట బడింది, రెండు. అప్పటికి భారతదేశమింకా వస్తుమార్పిడి ఆర్థిక విధానం నుండి ద్రవ్య విధానానికి పూర్తిగా మారిపోలేదు.

బ్రిటీష్‌వారి ప్రభావం, అధికారం ...విస్తరణ పొందే ఈ క్లిష్టసమయంలో వారు మొదటి ఆఫ్ఘన్ యుద్ధంలోను(1838-42), క్రిమియా యుద్ధంలోను(1854-56), సిక్కులతో రెండు యుద్ధాలలోనూ(1845-49) కొన్ని నష్టాలు పొందారు. అందువలన చివరకు ఆ యుద్ధాలలో వారు విజయం సాధించినప్పటికీ, "వారి అజేయత" పై ఉన్న సాధారణ విస్వాసం ఇంచుమించు పటాపంచలైంది; ఎందుచేతనంటే బ్రిటీషువారు అతీత మానవులు కారని ప్రజలు గ్రహించగలిగారు. వారుకూడా ఘోరమైన తప్పులు చేయగల సమర్థులు — ఆ తప్పులను వివేకవంతులైన శత్రువులు చక్కగా వాడుకో వచ్చును.

బ్రిటిషు సైన్యపు అజేయతపై విశ్వాసం సన్నగిల్లి పోయినప్పుడే, భారతీయ సైనికులకు బ్రిటీషు విషయాలన్నింటికీ తమ ప్రతిభ కారణమని భారతీయ సైనికులు నమ్మ ప్రారంభించారు. బర్మా నుండి కాబూల్ వరకు హిందూ దేశాన్ని జయించడానికి తామే కారణమన్న నమ్మకాన్ని నిర్ద్వందంగా ప్రకటించారు భారతీయ సైనికులు. ఈ నమ్మకం పెరిగిపోవడానికి కంపెనీ సైన్యపు సంఖ్యా వ్యవస్థ కూడా ముఖ్య కారణం. బ్రిటీష్ సైనికులు 40వేలు అయితే, భారతీయ సిపాయిలు 3 లక్షల 60 వేలు. ఫిరంగి దళంలో యూరపియనులు 6,500 అయితే భారతీయులు 12,000.

బ్రిటిషు వారివి అనంతమైన వనరులనే విశ్వాసం పటాపంచలయిన వాటిల్లో ఒకటి. కేయే దీన్ని నొక్కివక్కాణించాడు. "క్రిమియన్ యుద్ధంకోసం భారతీయులను సైన్యంలో చేర్చుకోవాలని పార్లమెంటులో ఆలోచన జరిగినప్పుడు తెలివైన భారతీయులు ఆశ్చర్యపడ్డారు మన వనరుల లోపాన్ని ఇంతకంటే గంభీరంగా చెప్ప సాధ్యం కాదు. ఒక ప్రాంతంలో నగ్నమైనప్పుడే మరో ప్రాంతంలో పూర్తిగా వస్త్ర ధారణ చేయగలమని చెప్పినట్లైంది.

ఈ పరిస్థితుల్లో సింధు, పంజాబుల్లాంటి పరాయి ప్రాంతాల్లో పనిచేసే సందర్భంలో ప్రత్యేకసౌకర్యాలు లభించవని చెప్పినప్పుడు సిపాయిలు వెన్వెంటనే అనగలిగారు -అంటే బత్తాలు వగైరాలు లభించవని చెప్పినప్పుడు-ఇటీవలివరకూ పరదేశంగా భావించబడిన ప్రాంతాన్ని బ్రిటీషువారి సరిహద్దు రేఖ అధిగమించి నంతమాత్రాన తమ ప్రత్యేక హక్కులను ఎందుకు వదులుకోవాలనేది .వారి ప్రశ్న. ఈ ప్రాంతాలను తమ సహాయం లేకుండా ఆక్రమించగలిగేవారు కాదన్న ధృఢ విశ్వాసం కల సిపాయిలతో సంప్రదింపులు, రాజీలు .. అసాధ్యంగా తోచాయి. తాము చేసిన సేవలకు ఫలితంగా తమ యాజమాని (అంటే కంపెనీ) తమకు న్యాయంగా రావలసిన పారితోషికం నిరాకరించడం . వారిలో విషాదాన్ని సృష్టించింది.

తమ మత విశ్వాసాల్లో కంపెనీ అనవసరంగా కలగజేసుకుంటోందనే మరో భావం కూడా సిపాయిల మనసునొప్పించింది. సతీసహగమన నిషేధం, హిందూ విధవా పునర్వివాహం, స్త్రీ శిశుహత్యానిషేధం మొదలైన సంస్కరణలు మంచివో చెడ్డవో అలాఉంచగా, భారతీయ సంప్రదాయాలకు పూర్తిగా విరుద్ధమైనవిగా భావించబడ్డాయి. భారతీయుల అనుమానాలను అవి మరికొంచెం పెంచాయి. క్రైస్తవ మత స్వీకారం చేసిన వారిక్కూడా పిత్రార్జితంలో వాటా ఉందని 1850లో చట్టం చేయబడింది. భారతీయులలో ఈ చట్టం సృష్టించిన ఆగ్రహం అలా ఉండగా, ఎడ్మండ్ అనే వ్యక్తి కంపెనీ ప్రభుత్వంలోని ముఖ్యాధికారులకు ఒక లేఖ రాసాడు. ఈ ఉపఖండం మొత్తం క్రైస్తవ రాజ్యాధికారం క్రింద ఉన్నది కనుక, భారతీయుల నందరినీ క్రైస్తవులుగా మార్చడం సక్రమమని. ..ఆ లేఖ సారాంశం. "ఈ లేఖను గురించి తెలిసిన భారతీయులకు భయోత్పాతం కలిగిందని చెప్పడం అతిశయోక్తి కాదు" అని సర్ సయ్యద్ అహమద్‌ఖాన్ రాసాడు. మొదటగా కంపెనీలో పని చేస్తున్న భారతీయోద్యోగులను క్రైస్తవులుగా మారుస్తారనీ, ఆ తర్వాత మిగతా జనాభాను మారుస్తారనీ ..వదంతి వ్యాపించింది. అసలా ఉత్తరం ప్రభుత్వమే తయారు చేసిందని నమ్మకం ప్రబలింది. ఎడ్మండ్ లేఖను గురించిన సమాచారం అందగానే బెంగాల్ లెఫ్టినెంట్

గవర్నరు దాన్ని ఖండించాడు. ఆ ఖండన తాత్కాలికంగా మాత్రమే పని చేసింది; ప్రభుత్వం ఆ నిర్ణయాన్ని వాయిదా వేసిందనీ, సమయం చిక్కగానే ఆ పని జరిగి తీరుతుందనీ ప్రజాసామాన్యం విశ్వసించింది.

ఆ క్షణాన ఉన్న మానసిక పరిస్థితిని గురించి బ్రిటిషు ప్రభుత్వానికి స్వల్పంగా మాత్రమే తెలుసుననడానికి సందేహం లేదు. పాలకులకూ, పాలితులకూ మధ్య సంసర్గం లేదు-సంపర్కం లేదు. కలిసి బతకడం లేదు. దగ్గరగాకూడా లేరు-వాయువ్యదిశనుండి వచ్చిన విజేతలందరూ అలా కలిసి ఉండేవారు. ఆంగ్లేయపాలకులు ఎప్పుడూ పదవీ విరమణకాలం కోసం, తిరిగి తమ ఇళ్ళకు పోవడంకోసం ఎదురు చూసేవారు అరుదుగా, భారతదేశంలో స్థిరపడడానికి వచ్చేవారు.

దేశ పాలనా వ్యవస్థలో భారతీయవాణి అంటూ ఏదీ లేదు. చట్టాలు, నియమాలు ప్రతిపాదించేటప్పుడు వాటి మంచీ-చెడూ తెలుసుకునే అవకాశం ప్రభుత్వానికి లేదు. ఆ విషయాలపై ప్రజాభిప్రాయం తెలుసుకోగలిగేది కాదు-నిజానికి తెలుసుకోవాలి. ఏది తప్పో చెప్పే మార్గంకాని, వ్యతిరేకించే పద్ధతిగాని ప్రజలకు అందుబాటులో లేవు. వారి కోర్కెలను తెలిపే అవకాశం లేదు. "ఇందులో ఉన్న పెద్ద హాని ఒకటే. ప్రభుత్వపు దృక్పథాన్ని, లక్ష్యాలను ప్రజలు అపార్థం చేసుకున్నారు. ప్రతి చట్టాన్నీ అనుమానించసాగారు. శాసన నిర్మాణంలో ఏమాత్రం ప్రమేయంలేని ప్రజలకు, శాసన స్వభావాన్ని అర్థం చేసుకునే అవకాశం లేదు. అందువల్ల దాన్ని తప్పుగానే లెక్కించారు. ఏదేమైనా, తమను హీనపరచడానికీ, నాశనం చేయడానికీ .అలాగే తమనూ తమ సహచరులనూ తమ మతాలనుంచి దూరం చేయడానికి మాత్రమే శాసనాలు తయారవుతున్నాయనే భావం భారతీయులకు అలవాటుగా మారిపోయింది. చిట్టచివరికి వారు బ్రిటిషు ప్రభుత్వాన్ని విషప్రాయంగా, సైకతరజ్జువుగా, కుత్సితమైన అగ్నిజ్వాలగా చూడసాగారు. ఈనాడు ప్రభుత్వపు పిడికిలినుంచి తప్పించుకోగలిగినా, రేపైనా ఆ పిడికిలికి చిక్కక తప్పదని వారు విశ్వసించసాగారు; రేపు తప్పించుకున్నా ఆ మరునాడైనా తప్పదు. పాలకులు, పాలితులు . ఈ భావాలతో ఉన్నప్పుడు ప్రభు భక్తికీ, సహృదయతకూ అవకాశం ఏదీ?"

అందరు ఆంగ్లేయులకూ ఆధీన భారతీయుల భావాలు తెలియదనలేము. వారిలో కొందరైనా, ఈ ప్రాంతంలోని ఉద్విగ్న పరిస్థితిపై కంపెనీ ప్రభుత్వాన్ని హెచ్చరించారు. "ఒక శుభోదయాన మేల్కొని బ్రిటిషు రాజ్యాధిపత్యం నుంచి భారతదేశం తొలగిపోయిందని గుర్తించే" అవకాశాన్ని మెట్కాఫ్ ఊహించాడు. స్థానిక సంస్థానాలు "ఏకమై సాహసమేదో" చేసే అవకాశముందని 1852 ఏప్రిల్‌లో కర్నల్ స్లీమన్

డల్‌హౌసీకి రాశాడు. అవధ్ తాలుక్దార్ల గొడవలు ఎయ్యకుండా ఉండడానికి కారణం "భారతీయులు ప్రభుత్వ ఇష్టానిష్టాలను భరించి, తలవంచే అలవాటు" అని డైరక్టర్ టకర్ ప్రభుత్వాన్ని హెచ్చరించాడు. "కాని మన పశ్చిమ సరిహద్దుల్లో శత్రువెవరైనా తలెత్తినా, లేక దురదృష్టవశాత్తూ తిరుగుబాటు లేచినా . తాలూక్దార్లను శత్రుపక్షంలో చూడగలుగుతాం. వారి రైతులూ, అనుచరులూకూడా అటే ఉంటారు" అని కూడా రాశాడు. లండన్ నుంచి బయలుదేరబోయేముందు లార్డ్‌కానింగ్ ఇలా అన్నాడు : "ప్రశాంతంగా కనబడుతున్న భారతీయ వినీలాకాశంలో ఒక చిన్న మబ్బు తునక-అరచేతికన్నా పెద్దది కాకపోవచ్చు-కనబడిందంటే అది పెరిగి పెరిగి చివరకు బద్ద లవడానికి తయారయి, మనలను సర్వనాశనం చేయొచ్చు". ఈ హెచ్చరికలను కంపెనీ ప్రభుత్వం లెక్కచేయలేదు.

అదీ ఆ కాలపు వాతావరణం. మామూలుగా సాదా సంఘటన కూడా పరిస్థితికి అగ్గి పెట్టవచ్చు. అప్పుడే ప్రభుత్వం కొత్తరకం తూటాలను ప్రవేశపెట్టడానికి నిర్ణయించింది. ఆ తూటాలకు కొవ్వు-ఆవు, పంది-పూశారనీ, ఆ తూటాలను వాడిన క్షణంలో మత భ్రష్టులమైపోతామనీ సిపాయిలు తలపోశారు. "ఆ విధంగా భగ్గుమన డానికి అనువుగా ఉన్న ద్రవ్యంపై, ఒక యాదృచ్ఛికమైన రవ్వ-అది ప్రమాదమైనది-పడినట్లైంది". ప్లాసీ యుద్ధం, ఆ తర్వాత కాలాల్లో.... పేరుకుంటూ వచ్చిన ద్వేషం ఉధృతంగా పైకెగసింది. అన్నీ కోల్పోయినవారు, అసంతృప్త రాజాలు, రాణీలు, జమీందార్లు, కౌలుదార్లు, కళానిపుణులు, కూలీలు, ముస్లిం మతగురువులు, విద్యాధికులు, హిందూ పండితులు ... అందరూ తమ బాధలను పోగొట్టుకునే మహాదవకాశంగా భావించారు. బ్రిటిషువారు భారతదేశంలో అడుగు పెట్టిన తర్వాత విభిన్నశక్తులు ఒక్కుమ్మడిగా తమకు వ్యతిరేకంగా కలిసి ఎదుర నిలవడం మొదటిసారిగా చూశారు.

## నిర్మాణం

అప్పుడొక ప్రశ్న ఎదురౌతుంది: తిరుగుబాటును సంఘటితపరిచి, మార్గం నిర్ణయించి, నాయకత్వం వహించిన వ్యవస్థా నిర్మాణమేమిటి ?

తిరుగుబాటుదారుల నిర్మాణాన్ని-ముఖ్యంగా తిరుగుబాటుకు ముందుకాలంలో గురించి మనకు తెలిసింది స్వల్పం. దీనికి కారణం స్పష్టమే. తిరుగుబాటుదారులు చట్ట విరుద్ధంగా పనిచేసేవారు. అందువలన నిర్మాణానికి సంబంధించిన సమాచారాన్ని లిఖితం చేయలేదు. అంటే వారి రహస్య సంస్థా నిర్మాణ స్వభావం, కార్యక్రమాలు, వ్యవస్థ

గూఢంగానే ఉండిపోయాయి. తిరుగుబాటును గురించిన పుస్తకాలు అసంఖ్యాకమన్న మాటకూడ నిజమే. దేశ సంచారం చేసే మౌల్వీలు, ఫకీర్లు, పండితులు, సన్యాసులు, ఐచ్ఛిక భిక్షాటనదళాలు, మంత్రగాళ్ళు ఊరూరా తిరుగుతూ తిరుగుబాటు సందేశాన్ని వ్యాపింపజేశారని ఆ పుస్తకాలు చెపుతాయి. అరుణ కమలం, చపాతీ . ఒక ఊరినుంచి మరో ఊరికి వెళ్తూ వుండేవని చెప్పే కథలతో నిండిన పుస్తకాలు కూడా అసంఖ్యాకమే. 'భారతదేశపు తిరుగుబాటు కథనం' గ్రంథకర్త 'కమలం యాత్ర'ను గురించి ఇలా రాశాడు. "ఒక వ్యక్తి కమలంతో ప్రత్యక్షమై దాన్ని ఆ సేనాదళపు అధికారికి అందజేస్తాడు. అతడు మరొకరికి అందజేస్తాడు- దాన్ని తీసుకున్న ప్రతి ఒక్కరూ మరొకరికి అందజేస్తూపోతారు. ఆ క్రమం ఆఖరయ్యేసరికి చివరి మనిషి అక్కడనుంచి తప్పుకొని తర్వాతి మకాంకు వెళ్ళిపోతాడు. 'కమలం' స్పర్శ లేని మకాంకాని, సైన్యదళంకాని లేదనిపిస్తుంది". అరుణ కమలం సిపాయిలనందరినీ ఏకం చేసిందని సర్ జార్జి ఆటో ట్రెవెల్యాన్ అభిప్రాయపడ్డాడు. మిగిలినవారందరితో కలిసికట్టుగా కర్తవ్య నిర్వహణ చేస్తానని ప్రతివాదూ ఆ కమలంపై ప్రమాణం చేసి చెపుతాడు.

ఈ రతంగం తర్వాత ప్రతి దళమూ సొంత రహస్య శాఖను నిర్మించుకునేది. 'లక్నో రక్షణ' అనే పుస్తకంలో విల్సన్ ఇలా రాశాడు. "లభించిన సాక్ష్యాధారాలను బట్టి ప్రతి దళంలోనూ ముగ్గురు సభ్యులున్న సమితి ఉంది. తిరుగుబాటుకు సంబంధించిన ప్రతి విషయమూ ఆ సమితి నిర్వహిస్తుంది ముఖ్యమైన పన్నాగాలు, ఉత్తర ప్రత్యుత్తరాలు ఇంకా అనేకం ఆ సమితి నిర్ణయిస్తుంది. సిపాయిలు రాత్రిళ్ళు రహస్యంగా కలుసుకునేవారని సావర్కార్ అంటాడు. సాధారణ సమావేశాల్లో తీర్మానాలు చేయబడేవి. ఆంతరంగిక నాయకత్వ నిర్ణయాలు అందరికీ శిరోధార్యంగా ఉండేవి.

రహస్య సమావేశాలకు హాజరయినప్పుడు సిపాయిలు పళ్ళు మినహా ముఖమంతా కప్పుకుని ఒక మోరికలను వాడపెట్టేవాడు. సమావేశాలలో ప్రతినిధులు దేశంపై కొనసాగిస్తున్న అనేకానేక అత్యాచారాలను గురించి విస్తరించి చెప్పుకునేవారు. ద్రోహం చేస్తున్నాడని ఎవరిమీదనైనా అనుమానం వస్తే వాడు ఖతం. ఒకదళంలో సంఘటితమైన నిర్మాణం పూర్తికాగానే ఆ దళపు ప్రధాన సమితి మరో దళపు ప్రధాన సమితితో సంబంధం పెట్టుకుని కలిసి పనిచేయడానికి సంప్రదింపులు జరిపేది. ఈ దళాల మధ్య పరస్పర ప్రమాణాలు-వ్యక్తిగతంగా సిపాయిల మధ్య నున్న ప్రమాణాలవలెనే- దృఢంగా క్లుప్తంగా ఉండేవి. విస్తృత సంఘటనా వ్యవస్థలో ప్రతి దళమూ ఒక భాగం. వివిధ దళాలమధ్య సంప్రదింపులకనుకూలంగా పండుగలకూ పబ్బాలకూ ఒక దళం

మరో దళాన్ని విందులకు ఆహ్వానించడం ఒక రివాజుగా ఉండేది. ఇది సమావేశాలకు వంకగా పనికివచ్చేది. ఎంచిన సిపాయిలు తరచు సుబేదార్ల ఇండ్లలో సమావేశమయ్యే వారు. ముఖ్యమైన విషయాల నిర్ణయం ఉన్నతోద్యోగులకు వదిలిపెట్టేవారు.

తిరుగుబాటు బద్ధలవడానికి ముందు చపాతీల పంపకం, బహుశా రాబోయే పోరాటానికి సిద్ధంకండని చెప్పే సంజ్ఞ కావచ్చు. ఫిబ్రవరిలో ఒక ఉదయాన జరిగిన సంఘటనను నవాబ్ మొయినుద్దీన్ వర్ణించాడు. సెరాయి సరూక్‌ఖాన్ దగ్గరున్న కాపలామనిషి ఒక చపాతీ తెచ్చి అలాంటి ఐదు చపాతీలను తయారుచేసి దగ్గర్లోవున్న ఐదు గ్రామాలకు వాటిని పంపి తిరిగి వారుకూడా అలాగే ఐదేసి చపాతీలను పంచాలని ఉత్తర్వు చేశాడు. ఆ చపాతీలు గోధుమ, బార్లీ పిండితో తయారు చేయబడేవి. ఒకో చపాతీ అరచెయ్యంత ఉండేది. బరువు రెండు తులాలు.

చపాతీల పంపకం సరిగ్గా 1803లో మరాటాలు ఉత్తర భారతంపై దాడిచేయ డానికి ముందు జరిగినట్టుగానే సంభవించింది; చపాతీతోపాటు మాంసం బదులుగా ఒక చిన్న చెట్టు రెమ్మ ఉండడమొకటే వ్యత్యాసం. అలాగే సంతాలుల తిరుగుబాటుకు ముందుకూడ, చెట్టు రెమ్మ ఊరూరా ప్రయాణించింది. "1806లో చిర ప్రాంత సైన్యపు తిరుగుబాటుకు ముందు పంచదారపొడి రహస్య ప్రయాణం చేసింద"ని సర్ జాన్ మాల్కం అన్నాడు. ఈ చపాతీల దర్శనం పుణ్యాన, రాబోయే ఉత్పాతాన్ని సూచించే జోస్యాలు, వదంతులు ప్రచారమయ్యాయి. ప్రజల మనస్సుల్లో ఆందోళన రేకెత్తింది.

తిరుగుబాటు ప్రధానంగా ముస్లిములచేత రూపొందించబడిందని ఆనాటి బ్రిటీష అధికారుల సాధారణ విశ్వాసం. తిరుగుబాటుకు ప్రధానంగా హిందూస్థానీ—మహమ్మ దీయులే మూలకారణమని పంజాబు ప్రభుత్వం మొదటినుంచీ చెబుతూ వచ్చిందని చెపరెండు రేప్-బ్రౌన్ వక్కాణించాడు. మహమ్మదీయులు కుట్రదారులనీ, హిందువులు అమాయకంగా మోసపోయినవారనీ వారనుకునేవారు. రేప్-బ్రౌన్ అభిప్రాయంతో గబ్బిన్స్ ఏకీభవించాడు. మహమ్మదీయులు "జాగ్రత్తగా హిందువుల మానసికాందోళనను పెంచి పెద్దచేసి తమకు ప్రయోజనకరంగా మరల్చుకున్నార"ని అతడంటాడు. బహదూర్ షా 'జఫర్'ను విచారించిన సైనిక న్యాయసమితి కమిషనర్ ఇలా అన్నాడు; "ఈ విచారణా క్రమంలో ఒక ప్రధాన సత్యం వ్యక్తమైంది. మా పరిశీలనకైపోయిన ప్రతిచోటా ముస్లిములు చేసిన కుట్రల ఆనవాళ్ళు లభించాయి; కాని హిందువులు ఒక సమూహంగా మాపై కుట్ర చేసినట్లుకాని లేదా వారి బ్రాహ్మణులు, పురోహితులు క్రైస్తవులపై పవిత్ర యుద్ధాన్ని ప్రచారం చేసినట్లుగాని రుజువుపరచే కాగితంముక్క

కూడా లభించలేదు భవిష్యద్దృష్టి, అతీతశక్తులూ ఉన్నట్టు నటించే మహమ్మదీయ పురోహితుడు—మహమ్మదీయరాజు, అతని నకలు అతని అనుయాయి- మహమ్మదీయ రాజ్యాలైన పర్షియా, టర్కీల రహస్య రాయభార కార్యాలయము-మా రాజ్య పతనాన్ని ఉచ్చరించే మహమ్మదీయ జోస్యాలు-మన పాలన స్థానంలో వచ్చే మహమ్మదీయ పాలన-మహమ్మదీయ హంతకులచే కొనసాగించబడిన క్రూర హత్యలు-ఆ తిరుగు బాటును ఎగదోసే మహమ్మదీయ పత్రికా ప్రపంచం-తిరుగుబాటును ప్రారంభించిన మహమ్మదీయ సిపాయిలు ఇవన్నీ ఆ ఛాయలే. హైందవం ఏ రకంగానూ రంగంలో కనబడలేదని నేను చెప్పవచ్చును; ఒకవేళ అది తెరమీద కనబడితే తీవ్రమైన 'పొడగు వానికి' అణకువైన పాత్రలోనే. "ఇంగ్లీషువారు భగవంతుని సహాయంతో భారతదేశపు అధిపతులుగా ఇకమీదట కూడా ఉంటార"ని "ఈ తుంటరి ముసల్మానులకు" చూపిం చాలని సబాల్టరన్ రాబర్ట్స్ (తర్వాతికాలంలో ఫీల్డుమార్షల్ రాబర్ట్స్) కోరుకున్నాడు.

"ఒక పచ్చి మాంసపుముక్క" చపాతీలతోపాటు పంపడంవలన కూడా మహమ్మదీయుల కుట్ర వ్యక్తమైనట్లు వక్కాణించబడింది. హిందువులు స్థూలంగా శాకాహారులైనందువల్ల, వారీపనికి పాల్పడరు. ఇందులో పెద్దపెద్ద దూడలున్నందువలన పైవివరణ పర్కానికి నిలువజాలదు. మొదటగా "మహమ్మదీయులు పనికిమాలిన కుట్రదారులు; వారి పద్ధతులు చాలా గజిబిజిగా ఉంటాయి; వారు అతి తొందరగా హింసకు పూనుకుంటారు .మరోపక్క హిందువుల కుట్రల విషయంలో ప్రతిభ కలదు; సహనశక్తి, ఫలితాలను అంచనావేసే సామర్థ్యం, అవకాశాలను జాగ్రత్తగా అంచనావేసే స్వభావం, పరిస్థితులను ప్రయోజనకరంగా రూపుదిద్దే నేర్పు, కలిసివచ్చిన ప్రతిమలుపునూ ఉపయోగించుకునే నిశితశక్తి—ఇవన్నీ కుట్రకు సత్ఫలితాలను కలగజేసే గుణాలు—హిందువులకున్నాయి." అందుకనే "చిన్న మాంసపుముక్క బహుశా . నిర్మూలనకు సంజ్ఞ కావచ్చున"ని థియోఫిలస్ మెట్కాఫ్ అభిప్రాయపడ్డాడు "మహమ్మదీయులు, హిందువులూ స్పష్టంగా మనకు వ్యతిరేకంగా ఏకమయ్యార"ని కేయె అన్నమాట ఇప్పటి వివరణకు బలమిస్తుంది. తిరుగుబాటుదారులు-ఎక్కడైనాసరే- విజయం సాధించగానే గోహత్యను నిషేధించడం కూడా తిరుగుబాటు హిందూ-ముస్లిముల ఐకమత్య ఫలితమనే తీర్మానాన్ని బలపరుస్తుంది ఢిల్లీలో తిరుగుబాటుదార్లు నియమించిన పాలకవర్గ సభ్యులు పదిమందిలో ఐదుగురు హిందువులు: జనరల్ గౌరీశంకర్, (సుబేదార్ మేజర్‌లు) బహదూర్ జీవారామ్, శివరామమిశ్ర, హేత్‌రామ్, బేణీరామ్.

మౌలావీ అహ్మదుల్లా షా (ఫైజాబాద్) "నిస్సందేహంగా కుట్రకు నాయకుడు" అని కర్నల్ మాలెసన్ అంటాడు-దీన్ని కాదనలేం అనికూడా అన్నాడు. అలాగే నానా

సాహెబ్ మొదలైనవారు కూడా నాయకులన్నమాట కూడా కాదనజాలము. "తిరుగుబాటు బద్ధంవడానికి ముందు జరిగిన అనేకానేక కుట్రలలో నానాసాహెబ్ పాత్రను గురించి నాకేమాత్రం సందేహం లేదు. దేశంలో వివిధ ప్రాంతాల్లో లభించిన విడివిడి సాక్ష్యాలలో ఏకీభవాంశాలు నానాసాహెబ్ వృత్తాంతం .. ఊహాత్మకం కాదని రుజువు చేస్తాయి." అని కేయే వ్యాఖ్యానించాడు. కాగా, కున్వర్‌సింగ్ (బీహార్), అజిముల్లా, బఖ్త్‌ఖాన్, ఆలీనకీఖాన్, రంగో బాపూజీ, తాత్యాతోపే, రాణీలక్ష్మీభాయి(ఝాన్సీ) కూడా తిరుగుబాటు నాయకులలో ప్రసిద్ధులే. (తిరుగుబాటు మధ్యకాలంలో రెండు వర్గాల వారి మధ్యా విభేదాలు తలెత్తినమాట నిజమే. ఈ సంగతి తర్వాత పరిశీలించుదాం).

'ఢిల్లీలో తిరుగుబాటు: రెండు కథనాలు' పుస్తకంలో అప్పటి ఢిల్లీ కొత్వాల్ నవాబ్ మొయినుద్దీన్ తిరుగుబాటుకు ముందు రోజుల్లో కార్యనిర్వాహణా పద్ధతిని గురించి కొంత ఊహాగానం చేసాడు. ఆయన చెప్పిన ప్రకారమైతే, యూరపియన్ గృహాన్నిగాని, టెలిగ్రాఫ్ కార్యాలయాన్నిగాని . తగలపెట్టడం ఒక సంజ్ఞ లాంటిది. టెలిగ్రాఫ్ కార్యాలయం తగలబడితే, ఆ వార్త కలకత్తా నుంచి పంజాబ్ వరకు అన్ని ప్రాంతాలకు తక్షణం తెలియజేయబడుతుంది. ఆ వార్త వినగానే, రహస్యమెరిగినవారు, తాముకూడా అదే పని (తగలబెట్టడం) చేయాలని గ్రహిస్తారు—అని అంచనా. ఇలాంటి విధ్వంసకాండకు సంబంధించిన వార్త దేశమంతా విస్తృతంగా వ్యాపిస్తుంది; ప్రతి దళంనుంచి ఇతర దళాల వారికి ఉత్తరాలు పంపబడ్డాయి. ఎవరైనా తమ కార్యకలాపాలకు అనుకూలంగా నడుచుకోకపోతే, సాంఘికమైన (లేదా కులపు) వెలి జరుగుతుందని హెచ్చరించబడింది. ఉత్తర ప్రత్యుత్తరాలలో ఒక రకమైన సంజ్ఞా భాష (చుక్కలూ, అంకెలూ) ఉపయోగించబడింది. పేర్ల ప్రసక్తి ఉండేదికాదు. ఫీల్డ్‌మార్షల్ రాబర్ట్స్ కథనం ప్రకారం, అజిముల్లా కాన్‌స్టాంట్‌నోపిల్‌లోని ఓమర్‌పాషాతో కుట్రకు సంబంధించిన వ్యవహారాల పై ఉత్తరప్రత్యుత్తరాలు సాగించాడు. సిపాయిల అసంతృప్తి, భారతదేశం ఎదుర్కొంటున్న సాధారణ క్లిష్టపరిస్థితి, అందులో వివరించదగే కాక బ్రిటీషురాజ్యాన్ని కూలద్రోయడంలో టర్కీ సహాయం కూడా అర్థించబడింది .అలాగే, అజిముల్లా ఫ్రెంచి ప్రభుత్వంతో (చంద్రనగర్‌లో ఉన్న ఫ్రెంచివారి ద్వారా) కూడా అలాంటి సంబంధాలు పెట్టుకున్నాడని కూడా రాబర్ట్స్ చెప్పాడు.

"మౌఖికంగా లభించిన సాక్ష్యాలను, జరిగిన వాస్తవ సంఘటనలతో జాగ్రత్తగా మదింపువేసి" 31 మే, 1857ను తిరుగుబాటు ప్రారంభదినంగా నిర్ణయించబడిందని . కాక్‌ఫర్డ్ విల్సన్ అభిప్రాయపడ్డాడు. ఆ రోజున బెంగాల్ సైన్యమంతటా తిరుగుబాటు మొదలుకావాలి. అయితే సమర్థులైన మరకొందరు పరిశీలకులు విల్సన్ "అభిప్రాయాన్ని"

అంగీకరించలేదు. ఉదాహరణకు సర్ జాన్ లారెన్స్. "పట్టుబడిన సిపాయిల ఉత్తరాల్లో ఎక్కడా ఆ కుట్ర సూచనకూడా లేదు. విశ్వాసపాత్రులైన సిపాయిలకుకాని, ఒక్క మాట చెపితే ప్రాణం రక్షించుకునే అవకాశమున్న - శిక్షించబడిన - తిరుగుబాటు దారులకుగాని ఆ కుట్ర గురించి - దానికొక ప్రణాళిక ఉంటే - తెలియదు."— సర్ లారెన్స్. "ప్రజలు కాని, సైనికులు కాని ఎందుచేత ఒకేసారిగా తిరగబడలేదు?" అని అతని ప్రశ్న. ఒకవేళ మీరట్ సంఘటనలే తిరుగుబాటుకు ప్రారంభమని ముందే అనుకొని ఉన్నట్లయితే... "ఆ వార్త తెలిసిన వెంటనే తిరుగుబాటు ప్రజ్వరిల్లక పోవ డానికి కారణమేమిటి?" అని కూడా అతని ప్రశ్న.

ఇవన్నీ సక్రమమైన ప్రశ్నలే. సందేహం లేదు. అయితే వాస్తవాలు ఇందుకు భిన్నంగా ఉన్నాయి; తిరుగుబాటుతో ముడిపడ్డ కొన్ని ప్రశ్నలకు సమాధానం లేదు. 11 మే, 1857న ఢిల్లీలో సిపాయిలు, మీరట్ తిరుగుబాటుదారుల తుపాకులకు తమ అధికారులను కొందరిని ఎందుకప్పగించారు? ఒకటి రెండు మాసాల్లోనే, అంత విపరీత ప్రమాణంలో సిపాయిలు ఎందుకు తిరుగుబాటు చేసారు? గంగా జమునల మధ్యనున్న మొత్తం ప్రాంతంలో తిరుగుబాటును లేవగొట్ట గలిగారనే వాస్తవమే, తిరుగుబాటుదారుల నాయకత్వపు నిర్మాణ దక్షతనూ, రహస్యపు ఏర్పాట్లనూ . ఎలుగెత్తి చాటుతుంది. సంఘటిత నిర్మాణం అవసరమైన మేరకు జరగలేదనేది నిజమే: పోరాటానికి ఏకీకృత మైన ప్రణాళిక లేదు, సర్వసమగ్ర నాయకత్వమూ లేదు.

అందుచేత తిరుగుబాటుదారులు పోరాటానికి ముందు కాలంలో కొంత "నిర్మాణ సృష్టి" చేసారని సులభంగా తీర్మానించుకోవచ్చును. అలాగే, తిరుగుబాటు మొదలైన క్షణాన, ఆ నిర్మాణ వ్యవస్థ ఇంకా 'అండదశ'లోనే ఉందనేది కూడా స్పష్టమే.

## పోరాట విస్తృతి

మీరట్‌లో 1857 మే 10న ప్రారంభమైన తిరుగుబాటు కార్చిచ్చులా వ ఏంచి. తిరుగుబాటు రగుల్కొన్న వారం రోజుల్లో భారతదేశపు ఉత్తర ప్రాంతాన ఉన్న బ్రిటిష సామ్రాజ్యం ఇంచుమించు అదృశ్యమైంది. బెంగాల్, పంజాబ్ సరిహద్దుల మధ్య ప్రాంతంలో బ్రిటిషు ఆధిపత్యం ఆగ్రా చుట్టుపక్కల కొన్నిమైళ్ళ పర్యంతం మాత్రమే మిగిలిఉన్నది - కాక ఇంగ్లీషు సేనలు మకాం చేసిన కొన్ని చిన్న చిన్న ప్రదేశాలు "ప్రస్తుతం భారతదేశంలో ఉండడమంటే అగ్నిపర్వతం అంచున నిలబడడ మన్నమాట ..దాని అంచులు క్షణ క్షణం కుంగిపోతున్నాయి. మరోవైపున సలసల

కాగుతున్న లావా ఎగసి మనల్ని హరించడానికి సిద్ధంగా ఉంది." ఉత్తర భారతంలో ప్రతి నాగరికర్రూ. . ఆయుధమైపోయింది.

భారతదేశపు ప్రాచీన రాజధాని ఢిల్లీకి మీరట్ తిరుగుబాటుదారులు. .. వేగంగా చేరుకున్నారు. ఏమాత్రం నిరోదం లేకనే ఢిల్లీ గేటుగుండా ప్రవేశించి, చివరి మొగల్ పాలకుడు బహదూర్షా "జఫర్"ను పట్టుకొని అతన్ని "షాహెన్షా-ఎ-హిందుస్థాన్" (భారత చక్రవర్తి) గా ప్రకటించారు. అవధ్ పాలనా యంత్రాంగం పేక మేడలా కూలిపోయింది. 'బ్రిటీషు ఆధిపత్యం- రాష్ట్ర రాజధాని చుట్టుపక్కలకే పరిమితమైంది.' —గబ్బిన్స్. రోహిల్ ఖండ్‌లో గ్రామీణప్రాంతమంతటా తిరుగుబాటు అల్లుకుంది. ఇంచు మించు బుందెల్‌ఖండ్ మొత్తం బ్రిటీషు పాలనపై కత్తి దూసింది. దోవాబ్ మొత్తం విప్లవతరంగాలు. "క్షణాలమీద ..గంగా జమునా జలాలతో తడుస్తున్న మైదానప్రాంత మంతా (ఉత్తర భారతం) ఆపైన బెంగాలు వరకూ, బ్రిటీషు ఆధిపత్యం నిలిచి పోయింది; పౌరపాలన చిన్నా భిన్నమైంది" అని మెక్‌లియాడ్ ఇన్నెస్ వ్యాఖ్యానిం చాడు "మధ్య భారతం చేజారిపోయిందనే అనిపిస్తోంది నాకు; పునరాక్రమించాలి అని కానింగ్ రాసాడు.

కాన్పూర్‌లో తిరుగుబాటుదారులను నానాసాహెబ్ "నడిపాడు" నానాసాహెబ్ తరపున ధర్మయుద్ధం సాగించవలసిందిగా మహారాష్ట్ర పండితులు, (బ్రాహ్మణులు) రెచ్చగొట్టగా, ఆ గ్రామాల ప్రజలంతా తిరుగుబాటుదారుల సరసన నిలిచారు. "పరాయి వాని పీడన తొలగించుకోగల ఆఖరు అవకాశమిదే - ఈ భావమే ఆ ప్రాంతంలోని ప్రజలందరి మనస్సులోనూ ప్రవేశించింది. ఝాన్సీలో లక్ష్మీబాయి తిరుగుబాటు పతాకా న్నెగురవేసింది." పాట్నాలో వాహబీల మూర్ఖత్వమూ, బెనారస్‌లో బ్రాహ్మణుల మొండితనమూ .. ఆ రెండు పట్టణాలనూ అభేద్యంగా మార్చాయి. బ్రిటీషు పాలనకు ఆరోపించబడిన.... ధాన్యాల అధిక ధరలు అలహాబాద్ తిరుగుబాటు దారులకు ఒక వంకగా, ప్రచార సాధనంగా ఉపయోగపడ్డాయి. బీహారులో శాశ్వత శిస్తు విధానం పలలాగా కరిగిపోయింది.

సాధారణంగా, సిపాయిల తిరుగుబాటుకు కొంచెం అటూ ఇటూగా పట్టణంలోనూ, గ్రామ ప్రాంతంలోనూ తిరుగుబాటు ప్రజ్వరిల్లేది. అనేకచోట్ల సిపాయిలకంటే ముందు గానే ప్రజలు తిరగబడ్డారు-తిరుగుబాటు జరిగిన ప్రతిచోటా, ప్రభుత్వ కోశాగారం లూటీ అయ్యేది; ఆయుధాగారం దోపిడీ జరిగేది; సైన్య నివాసాలు, కచేరీలు అగ్నికి ఆహుతయ్యేవి; ఖైదుల ద్వారాలు బార్లాగా తెరుచుకునేవి. తిరుగుబాటుదారులు "వడ్డీ వ్యాపారస్తుల ఖాతాపుస్తకాలను ధ్వంసం చేసినట్లే, ప్రభుత్వపు రికార్డులనుకూడా కక్షగా

నాశనం చేసేవారు-కారణం ఒకటే. మనం అమలుపరిచిన పన్నుల పద్ధతి, క్రమశిక్షణ అమలు జరగడానికి ఆ రికార్డులే కారణమని వారి అంచనా" అందుకే ప్రభుత్వపు రికార్డులకూ, వడ్డీ వ్యాపారస్థుల ఖాతా పుస్తకాలకూ ఒకే గతి పట్టింది. "పాత భూస్వాములు లభించిన అవకాశాన్ని ..గట్టిగా పట్టుకున్నారు. తమ కౌలుదార్లను పోగుచేసి తమ భూములను కొన్న నడమంత్రపు భూస్వాములను ప్రారద్రోలారు. తిరిగి దిగ్విజయంగా తమ పూర్వీకుల గృహాలలో చేరిపోయారు. పిచ్చెక్కిన రుణగ్రస్తులు చుట్టుముట్టి వడ్డీ వ్యాపారులను వధించారు-చట్టపు అదుపు లేకపోతే ఈ పని ఇదివరకే చేసివుండేవారు." వ్యాపారులు ఆత్మరక్షణ కోసమైనా తిరుగుబాటు దారులతో సహకరించవలసి వచ్చింది.

సైనిక కేంద్రంలో విదేశీపాలన చిహ్నాలను ధ్వంసం చేసిన వెనుక దృష్టిని డిల్లీవైపు మరల్చారు. ఏదో ఒక ప్రాంతపు ఎగసిపాటుగా ముగిసిపోవలసిన ఉద్యమం, డిల్లీ ఆక్రమణతో రాజకీయ ప్రాధాన్యతను సంతరించుకుంది. భారతీయులపైనా, వారి వ్యవహారాలపైనా ఏ మాత్రం మక్కువలేని లోవె కూడా ఇలా అన్నాడు: తిరుగుబాటు దారులు "యుద్ధాని కవసరమైన ఒకటోరకం ఆయుధాగారమున్న అద్భుత కేంద్రాన్ని ఎన్నుకున్నారు. బ్రిటీషువారికి చెందిన అతిపెద్ద ఆయుధాగారమున్న ఆ నగరం సౌభాగ్యసౌందర్యాలతో తులతూగుతోంది ఆపైన శత్రుభావంతో ఉన్న ముస్లిముల జనాభా ఉంది". వ్యూహరీత్యా కూడా డిల్లీ ఆక్రమణ అద్భుతమైనచర్య. ఇక్కడ పట్టుబడిన బ్రిటీషు సైనికులను కట్టగట్టి మిగతా శ్రేణులనుంచి వేరుచేస్తారు. నష్టాలను పూడ్చుకొనే మార్గాంతరం లేక వారు గాలిలో కలిసిపోవాలిసిందే. భారత దేశంలో ఉన్న ఇంగ్లీషు సైన్యంలో ఎక్కువ భాగం ఆ రకంగా ఆ ప్రదేశంలో తేలికగా అదుపు చేయబడింది.

కాని ..ఆఖరి మొగల్ ప్రభువునూ, మహారాష్ట్రుడైన నానాసాహెబ్‌నూ అధికారంలో పునః ప్రతిష్టించాలనే నిర్ణయం రాజపుత్రసంస్థానాల్లోను, పంజాబు సిక్కుల్లోను, హైదరాబాద్ నిజాం మనస్సులోనూ అనుమానాలు రేకెత్తించింది. రాజపుత్ర సంస్థానాల వ్యూహాత్మక ప్రాధాన్యాన్ని లార్డ్ కానింగ్ స్పష్టంగా అంగీకరించాడు. "సింధియా తిరుగుబాటు దారులతో చేయి కలిపితే, నేను రేపే మూటా ముల్లె సర్దుకోవాల్సి ఉంటుంద"ని అతడు కోర్టు ఆఫ్ డైరెక్టర్సుకు రాసాడు. రాజపుత్ర సంస్థానాల పాలకులూ, ప్రజలూకూడ తిరుగుబాటు దారులు విజయం సాధిస్తే దోపిడీలు, దుండగాలు తిరిగి తలెత్తుతాయనీ అటు మొగలులూ, ఇటు మరాఠీలూ విధ్వంసం చేస్తారనీ.... భయపడ్డారు. కంపెనీ వారి "రక్షణ" లభించని పాతకాలం స్పష్టంగా వారికి జ్ఞాపకానికి వచ్చింది జార్జి లారెన్స్ ప్రకటనల ద్వారానూ, ఆచరణలోనూ ఏర్పరిచిన "రక్షణ" వలన

పొందిన "శాంతి, సంపద, వర్ధన" కోల్పోతామని కలతపడ్డారు. తమనుతాము రక్షించుకోవడానికై, వారు తమను మొగల్, మరాఠీ దాడిదోపిడీనుంచి రక్షించిన రాజ్యశక్తికే తమ చేయూతనిచ్చారు. నిజాంకూడా తిరుగుబాటు దారులపట్ల సానుభూతి చూపలేదు. అతని పూర్వీకులు మొగల్‌రాజ్య పతనం వలనచే "సంస్థానాన్ని" సృష్టించుకోగల్గారు. "మనలను ఒక్క కెరటంతో ముంచెత్తగల తుఫానుకు అడ్డుగోడవలె సంస్థానాలు పని చేసాయ"ని కానింగ్ శ్లాఘించాడు.

తిరుగుబాటుదారులు పంజాబు నుండి తమకెంతో ప్రోత్సాహం లభిస్తుందని ఆశించారు. బ్రిటీషువారు అంతకు ఎనిమిది సంవత్సరాలక్రితం మాత్రమే పంజాబును ఆక్రమించారు కనుక, అక్కడి ప్రజల హృదయాలనూ, విశ్వాసాన్నీ చూరగొని యుండరని వారి ఊహ. దాని సహాయం—లేదా సహాయ నిరాకరణం-మీదనే భారతదేశం లోని బ్రిటీషువారి ఉనికి ఆధారపడిఉంది. "పంజాబు ఎదురుతిరిగినట్లు అయితే, మన పరిస్థితి నిరాశామయమై ఉండేది ఇంగ్లండునుంచి బలగాలు చేరేవరకు మనము నిలవ కలిగి ఉండేవారం కాదు"అని థార్న్‌హిల్ అంగీకరించాడు. కాని పంజాబు 'మొత్తంమీద విశ్వసనీయంగానే ఉంది.' బ్రిటీషువారు ఈ రాష్ట్రంనుంచి అన్ని కులాలకూ, మతాలకూ, భాషలకూ చెందిన-39,000 మంది సైనికులను సమకూర్చగలిగారు.

తిరుగుబాటు పట్ల పంజాబు వైరభావానికి అనేక రకాల కారణాలున్నాయి. మొగలు పాలనాపునఃప్రతిష్ఠాపన అంటే తప్పనిసరిగా తమ అణచివేత అని సిక్కు సర్దారులు భావించారు. పైగా, సర్ హెన్రీ లారెన్సు వారితో మృదువుగా వ్యవహరించాడు. వారి దురదృష్టానికి సానుభూతి చూపాడు. అక్కడ బ్రిటీషువారు ఏ రాష్ట్రం లోనూ చూపనంత తక్కువ భూస్వామ్య సుంకం విధించారు. "తిరుగుబాటు కాలంలో సర్ జాన్ లారెన్సు ప్రభుత్వం సాధించిన అద్భుత విజయానికి, జాగీర్దార్ల పురాతనమైన హక్కులను కాపాడడానికి సర్ హెన్రీ లారెన్స్ తీసుకున్న చర్యలే ముఖ్య కారణం"— జి. డబ్ల్యు. ఫారెస్ట్. అనుమానితులైన సర్దారులను గోం నుంచి పంపేసారు. అక్కడనే నిలిచిపోవడానికి అనుమతింపబడిన సర్దారులను ఖాల్సా సైన్యపు నియంతృత్వం గుర్తుకువచ్చి, తిరుగుబాటు విజయం పట్ల విముఖత చూపారు; అందువల్ల మరో దుర్మార్గమైన సైన్యం పాలబడడం తప్ప మరేమీ లేదని భావించారు. సిక్కు యుద్ధాల్లో నాయకత్వం వహించిన సిక్కు భూస్వామ్య ప్రభువులకు బ్రిటీషు వారి నాయకత్వం కిందనున్న పూర్బియా సైనికుల చేతుల్లో పొందిన అపజయం స్ఫురణకు వచ్చింది. అందుకే బ్రిటీషువారికి తోడ్పడడానికి ముందుకు వచ్చారు. బ్రిటీషువారి అనుగ్రహాన్ని సాధించి తమ పూర్వపు అధికారాలను, ప్రత్యేక సౌకర్యాలనూ సాధించి

ఆనాటి అపజయాన్ని మాపుకోదలిచారు. పూర్బి హ సిపాయిలు తమను "హీన కులస్థుల"ని ముద్ర వేయడం కూడా వారు మరచిపోలేదు.

తిరుగుబాటు విజయవంతమైతే, ముస్లిముల చేతిలో మతపీడన జరిగి తీరుతుందని భావించడంవలనకూడా, సిక్కు ప్రజలు తిరుగుబాటు దారులతో చేతులు కలపడానికి వెనుకాడారు. ఢిల్లీచాంద్నీచౌక్‌లో తమ తొమ్మిదో గురు తేగ్ బహదూర్ ఆహుతి, ఆ తర్వాత సంభవించిన రెండు 'ఘలోఘరాస్' (హింసాకాండలు) ఇంకా వారి జ్ఞాపకాలలో ఉన్నాయి. వారి భావాలను చక్కగా అర్థం చేసుకున్నాడు లారెన్సు. అందుకనే ఢిల్లీ రాజు ఎవరైనాసరే సిక్కును చంపి, తల తెసుకువస్తే బహుమానమిస్తానన్నాడని జాన్ లారెన్స్ కావాలని వదంతులు ప్రచారం చేశాడు.

బ్రిటీషువారికి అండగా - పంజాబీలందరిలోను - సిక్కులు మాత్రమే నిలబడ్డారని చెప్పడం వాస్తవం కాదు. తిరుగుబాటు కాలంలో పంజాబీలు మొత్తం బ్రిటీషు వారికి సహకరించారు. మూడు మతాలకు - సిక్కులు, హిందువులు, ముస్లింలు - చెందిన గ్రామీణులందరూ వివిధ ప్రదేశాలలో తిరుగుబాటుదారులను బంధించడంలో సహాయపడ్డారు. భూమి శిస్తు అణాపైసల్తో సహా క్రమం తప్పకుండా చెల్లించబడేది. ఎక్సైజు సుంకాల వసూళ్ళు పెరిగాయనీ, ప్రభుత్వ పాఠశాలల్లో హాజరు స్వల్పంగా తగ్గిందనీ, . హోమ్స్ నివేదించాడు. "పంజాబులో కొన్ని జిల్లాలలో నిశ్చితమైన తేదీలకు ముందే శిస్తు వగైరాల చెల్లింపు జరిగేది; బ్రిటీషు రాజ్యపాలన కొనసాగించాలనే భావం వ్యక్తమయింది . (వారు) పాలకులను మార్చుకోవాలనుకోలేదు: ముఖ్యంగా అరాజకం ఊరేగబోతుందన్నప్పుడు".

పెషావరులో వర్తకుల వద్దనుంచి కంపెనీ ఎన్నో రుణాలను సేకరించింది. కంపెనీ ప్రభుత్వం కొనసాగడంలో వారి ప్రయోజనం ముడిపడి పోయింది. "తిరుగుబాటుకు అనాసక్త ప్రేక్షకులుగా ఉన్నవారు (వ్యాపారులు) చట్టాన్ని - తమ ప్రయోజనాలకోసమైనా- బలపరిచేవారిగా మార్చబడ్డారు.

పంజాబు ముస్లిములు తిరుగుబాటుదారులతో చేరడానికి భయపడ్డారు. వారిని బ్రిటీషువారు సిక్కుల పీడన నుండి రక్షించారు. భారతదేశంలోని మిగతా ప్రాంతాలలో బ్రిటీషువారు ముస్లిముల నాశనానికి, అణచివేతకు కారణమైనప్పటికీ, పంజాబులో మాత్రం వారికి రక్షకులే.

"కొన్ని పెద్ద పెద్ద కారణాలవల్ల స్వాతులు(Swatis), పెషావరీయులు, కాబూలీయులు సక్రమంగా ఉండగలిగారు. ఆ లోయ ప్రాంతంలో, శిస్తునిర్ణయం ఉదారంగా జరిగింది. అంతకుముందలాంటివి వారెరుగరు. హుగానీలు ప్రజలను

నలిపివేశారు. కాబూల్‌లో ఇప్పుడూ అంతే. సిక్కులు ఆ ప్రాంతంలో విధించిన శిస్తు 12 లక్షల రూపాయలు. ఆపైన దోపిడీ వేరే. బ్రిటిషు ప్రభుత్వం 6 లక్షలు మాత్రమే విధించి, తాను సంతృప్తి పడింది. ప్రజలనూ సంతృప్తులను చేసింది. (ఇంచుమించు అంతమొత్తం నెలకు ఖర్చుపెడుతుంది.) .. విస్తృత వ్యయం, విశాలమైన సైన్యాలు ధాన్య వ్యాపారాన్ని పెంచాయి. అలాగే పండ్లు, కలప - పర్వత ప్రాంతాలకు - కూడా బాగా గిరాకీ పెంచుకున్నాయి. పెషావర్, కంటోన్మెంటు గిరాకీని అడ్డుకొట్టడమే ఆ ..తెగవారికి కఠినమైన శిక్ష అనిపించే పరిస్థితి ఏర్పడి పోయింది."... "ఆ అనాగరిక ముస్లింలు మహమ్మద్‌నెంతో ప్రేమిస్తారు. డబ్బునింకా ఎక్కువ ప్రేమిస్తారు. అందుకనే బాకు, తల్వార్ లేదా గుఱ్ఱమైతే ఇంకా మంచిది. ఏది ఉంటే దాంతో పెషావరులో బ్రిటీషు అధికారుల వద్దకు వచ్చి . తమ సేవలను సమర్పించడానికి సిద్ధపడ్డారు" అని కేయే దయారహితంగా వ్యాఖ్యానించాడు.

పంజాబీల ప్రవర్తనపై ఇచ్చిన వివరణ సమంజసమే. పంజాబుపై జైత్రయాత్ర సమీపగతంలో జరిగిందే. ఆ విజయం వలన తాను బయటపడిన పీడనాకాలాన్నుంచి పంజాబీలింకా మరచిపోలేదు. అలాగే ఇతర రాష్ట్రాలలో బ్రిటీషు పాలన వల్ల దుష్ఫలితాలు వారి అనుభవంలోకి రాలేదు. మహారాజా రంజిత్ సింగ్ మరణానంతరం పెచ్చరిల్లిన అరాజక పాలనలో విధించబడిన పన్నుల భారం, లెవీల భారం కొత్త పాలనలో తగ్గించ బడ్డాయి. దారిదోపిడీ ఇంచుమించు నిర్మూలించబడింది. భూమిశిస్తు శాశ్వతంగా సక్రమ విలువలో నిర్ణయించ బడడంతో రైతుల అభివృద్ధి జరిగింది. వారికి సంతృప్తి కలిగింది. కొత్త పాలకులు శిస్తును తక్కువగానే నిర్ణయించారు. ఆ రకంగా "భూమి కలవారికి సక్రమంగానూ, ఉదారంగానూ ప్రయోజనం జరిగింది." పంజాబు సరిహద్దుకు సమీపంలో ఉండడం వలన, భూసంబంధాల విషయంలో పాలకులు అంతగా వేలుపెట్టలేదు. కొత్తగా రోడ్లు, కాలవలు, వంతెనలు ఎక్కువగా నిర్మాణమయ్యాయి. అటవీ సంరక్షణ, పశువుల మేతకై పచ్చికబీళ్ళ సంరక్షణ ఎక్కువగానే చేపట్టారు. అనేక సంవత్సరాల అస్థిరత, అరాజకం తర్వాత పంజాబీలు ధృఢమైన ప్రభుత్వం వలన సాధ్యమైన ప్రయోజనాలను చవిచూసారని ఒక్కమాటలో చెప్పవచ్చును.

ఆ పైన అంతకుముందెన్నడూ ఎరగని విధంగా, వరుసగా పంజాబులో పంటలుకూడా బాగా పండాయి. "దేశం ఆనందంగా పచ్చగా ఉంది. అందుకనే కేవలం మిత్రత్వంకోసం కొత్త 'గొడవ'లో ఇరుక్కోవడానికి సిద్ధంగా లేదు". తద్వారా అనిశ్చితమైన భవిష్యత్తులోకి దూకలేదు. ఈ అభిప్రాయాన్ని కూపర్ "పంజాబులో

సంక్షోభం" అనే పుస్తకంలో వెల్లడించాడు.

ఆ పైన మరికొన్ని "అనుబంధ కారణాలు"న్నాయని సర్ సయ్యద్ అహ్మద్ ఖాన్ అంటాడు. మొట్టమొదట "భారతదేశమంతటా నిండి ఉన్న కాటకం పంజాబు వరకూ ఇంకా చేరుకోలేదు." రెండు: అక్కడ బలీయమైన యూరపియన్ సైన్యముంది. మూడు: అధికారులు వివేకంతో సిపాయిలను నిరాయుధం చేసారు. నాలుగు: పంజాబును కలుపుకున్న తర్వాత ఆ ప్రాంతం మొత్తాన్ని నిరాయుధం చేసారు. ఐదు: పంజాబీలు, పఠానులు అప్పటికే కొలువులో చేరిపోయారు; ధైర్య సాహసాలు ప్రదర్శించి ఏదో సాధిద్దామనుకునే నిరుద్యోగ ప్రజలు లేరు. ఆరు: హిందుస్థాన్‌ను (అంటే ఢిల్లీ, లక్నో, ఆగ్రా మొదలైనచోట్ల) దోపిడీ చేద్దామనే కోరిక వారిని పట్టుకుంది. "ఆ విధంగా ఒక ప్రమాదకరమైన వర్గపు విధేయత - లొంగుబాటు కాకపోవచ్చు - భద్రంగా లభించింది."

అయితే తిరుగుబాటు తొలిరోజుల్లో బ్రిటీషు వారికి పంజాబీల "సహాయం" "మందకొడి"గా మాత్రమే లభించింది. "వారు సైన్యంలో పెద్ద సంఖ్యలో చేరలేదు. ఢిల్లీ పడిపోయే వరకు వేచి చూసారు. ఆ తర్వాత వేల సంఖ్యలో సైన్యంలో చేరారు."

## రాజకీయ వ్యవస్థ

తిరుగుబాటుదారులు తొలివిజయాలు సాధించగానే, ధృడమైన బ్రిటీషు వ్యతిరేక సమాఖ్య బలహీనమై, చీలిపోసాగింది. విదేశీ పాలనపై ఉన్న ద్వేషం వారి నేకం చేసింది; 'స్వేచ్ఛా' భారతంపై ఉన్న వివిధాభిప్రాయాలు వారిని విడగొట్టినవి. మొగల్‌లకూ, మరాఠీలకు మధ్య భూస్వామ్య శత్రుత్వం ప్రజ్వరిల్లింది. ఈ కారణం వలననే నానాసాహెబ్-ఆఖరి పీష్వా పెంపుడు కొడుకు-ఢిల్లీ వెళ్ళ నిరాకరించాడు. "మొగల్ రాజాస్థానం" తన ఆధిపత్యాన్ని మింగివేస్తుందనీ, అనేకమంది సంస్థానాధీశులలో తనకున్న వ్యక్తిగత అధికారం, ప్రభావం పోతాయనీ . .అతడు భయపడ్డాడు.

"జమీందారీలో అఖండ పాలన" సాధించే లక్ష్యంతో రెచ్చగొట్టి (లేదా ప్రోత్సహించి) తిరుగుబాటులోచేరిన భూస్వామ్య ప్రభువులు ఉద్యమం అదుపుతప్పి తమ చేతుల్లోంచి జారిపోవడం గమనించి నిర్ఘాంతపోయారు. "క్రిందివారు పైవారిపైచేసిన తిరుగుబాటు వల్ల తమ ప్రయోజనాలు నెరవేరవని కొద్దిమంది రాజాలుకూడా గ్రహించగలిగిన వివేకం చూపలేకపోయారని" ఆ కాలపు రచయిత "కలకత్తా సమీక్ష" (1858)లో పేర్కొన్నాడు. నేత రాజకీయ, ఆర్థిక పునర్నిర్మాణానికై తిరుగుబాటుదారులు తయారుచేసిన

ప్రణాళికలు రాజాలు సరిగ్గానే ఊహించగలిగారని తెలియజేస్తాయి.

1857 మే 11 న బహదూర్‌షాను షహెన్‌షా-ఎ-హింద్ గా ప్రకటించారు. (అంటే భారత చక్రవర్తి) కాని వాస్తవానికి జూలై మొదటివారంలో అతణ్ణి 'అగస్త్యభ్రాత'గా మార్చారు-అంటే తిరుగుబాటు ఆఖరిదశనాటికి సేనాని బఖ్తఖాన్ చేరుకోగానే, ఢిల్లీ తిరుగుబాటుదారులు కొత్తప్రభుత్వ వ్యవస్థను సూచిస్తూ ఒక ఫర్మానా జారీ చేసారు. బహదూర్ షాను తిరిగి లాంఛనంగా భారత చక్రవర్తిగా ప్రకటించారు. కాని వాస్తవమైన పాలనా నిర్వహణ బాధ్యత ఒక ఆస్థానాని' (**Court of Administration**)కు దాఖలైంది. రాజ్యపాలన, శాంతిభద్రతల పరిరక్షణ, ఉప మండలాలనుంచి భూమిశిస్తు వసూళ్ళు, మహాజనుల (వ్యాపారస్తులు) నుంచి ఋణసేకరణ ఆ ఆస్థాన బాధ్యతలు, "మీ విషయంలో ఏ మూలనుంచి ఎలాంటి నివేదిక వచ్చినా ఖాతరుచేయను, మీ ఆస్థానం నుంచి జారీఅయ్యే ఆజ్ఞల విషయంలో రాజ్యసేవకులు గాని, రాజవంశీయులు గాని ఏ రకంగానూ కలగజేసుకొనరు" అని చక్రవర్తి ఆ పాలనా వ్యవస్థకు వాగ్దానం చేసాడు.

ఆస్థానంలో 10 మంది సభ్యులుంటారు; అందులో ఆరుగురు సైన్యంనుంచీ, నలుగురు పౌరశాఖలనుంచీ ఉంటారు. సైన్య ప్రాతినిధ్యం మూడు శాఖలమధ్య సమానంగా ఉంటుంది-పదాతులు, అశ్వికదళం, ఫిరంగిదళం, "తెలివైన, వివేకంగల, సమర్థులైన అనుభవజ్ఞులనుండి-వారికి పాతఉద్యోగానుభవం కూడా ఉండాలి" - అధిక సభ్యుల అంగీకారంతో ఆ పదవుల ఎన్నిక జరుగుతుంది. ఈ చివరి షరతు అంత స్పష్టమైనది కాదు. ఎందుచేతనంటే తిరుగుబాటుదారులలో బహు కొద్దిమందికి మాత్రమే ఏదో మాదిరి అనుభవముంది. బహుశా, ఈ కారణంవల్లనే ఈ షరతును అంత నిక్కచ్చిగా పేర్కొనలేదు. ఈ విషయంలో వివరణ అంత స్పష్టంగా ఉండజాలదు కదా! మరి సమర్థులూ, వివేకవంతులూ అయిన వ్యక్తుల విషయంలో ఈ షరతుకు స్పష్టమైన మినహాయింపు ఇవ్వబడింది. పౌరశాఖలనుండి ఆస్థాన సభ్యుల ఎన్నిక విషయంలో కూడ, ఆయా శాఖలు ఇదే పద్ధతిలో వ్యవహరించాలి.

10 మంది సభ్యులలో ఒకరు అధ్యక్షుడు (సదర్-ఎ-జల్సా) గా ఎన్నుకోబడాలి. మరొకరు ఉపాధ్యక్షుడు (నాయబ్ సదర్-ఎ-జల్సా). ఆస్థానాధ్యక్షుడికి రెండు ఓట్లుంటాయి. ప్రతి సభ్యుడూ తనను ఎన్నిక చేసిన శాఖపై అజమాయిషీ చేస్తాడు. అతనికి నలుగురు ఆస్థాన సభ్యులతో కూడిన సమితి సహాయపడుతుంది. ప్రతి సమితికీ అవసరమైనంత మంది కార్యదర్శులుండవచ్చును. ఒక సమితిలో అంగీకారం పొందిన ప్రణాళికలను ఆ శాఖాబాధ్యుడైన సభ్యుని ద్వారా ఆస్థానాంగీకారానికి (అనుమతికి)

పంపబడతాయి. అధ్యక్షుడుగాను, ఉపాధ్యక్షుడుగానూ ఎన్నికైన సభ్యుల, శాఖాధిపతుల విషయంలో స్పష్టమైన సూచనలూ, పద్ధతులూ ప్రత్యేకంగా పేర్కొనబడలేదు. బహుశా తమ పదవులతోపాటుగా వీరే ఆ శాఖాధిపతులుగా వ్యవహరించాల్సి ఉంటుందనే భావించాలి. సర్ జార్జి కాంప్ బెల్ ఇలా రాశాడు: "ఢిల్లీ ప్రభుత్వం చట్టబద్ధమైన గూండాల పాలన లాగా కనబడుతోంది. రాజ్యాంగయుతమైన చక్రవర్తి వలెనే, రాజును రాజులాగా గౌరవించారు , కాని పార్లమెంటుకు బదులుగా అతనికొక సైన్య సమితి ఉంటుంది. అధికారం వీరి చేతిలోనే ఉంటుంది ; కాని అతడేవిధంగానూ వారికి సర్వసేనాని కాదు. (ఆ ఫర్మానాలో) అరబిక్ పదాలుగాని, పర్షియన్ పదాలు గాని ఉపయోగించబడలేదు , దవ్విరుద్ధంగా ఇంగ్లీషు పదాలు, కార్య నిర్వహణా విధానాలూ సాధారణంగా అనుసరించబడ్డాయి. అన్ని అర్జీలూ రాజుగారికే సంబోధించబడి ఉండాలి; కాని అన్ని విషయాలమీదా నిర్ణయాలు తీసుకునే అధికారం మాత్రం ఆస్థానానిదే-కొంతమంది కర్నలులూ, ఒక సైన్యాధిపతీ **(Brigade Majer)** కార్యదర్శి ఉన్న సమితి ఆస్థానం. కర్నలులూ మొదలైనవారంతా ఎంతో కొంత సాధించిన సిపాయిలు".

బహదూర్ షా చక్రవర్తికి ఆస్థానానికి హాజరయ్యే హక్కుంది. చక్రవర్తి సంతకం లేనిదే, ఆస్థాన నిర్ణయమేదీ రాజ్యంలో అమలులోకి రాజాలదు. చక్రవర్తి ఆస్థాన నిర్ణయానికి అంగీకరించకపోతే, ఆస్థానం దానిపై పునరాలోచన జరపాలి. వాస్తవంగా ఆచరణలో ఆస్థానం తన చిత్తం వచ్చినట్లు తీర్మానం చేసేది. ఆపైన సంతకం పెట్టవలసిందని చక్రవర్తిని వత్తిడి పెట్టేది. 1858లో బహదూర్ షా ను విచారించడానికి నియమింపబడిన సైనిక సంఘం ముందు సాక్ష్యమిస్తూ బహదూర్ షా ఇలా అన్నాడు: "తిరగబడిన సైనికులు ఆస్థానాన్ని ఏర్పరిచారు. దానిలో అన్ని వ్యవహారాలపైనా చర్చలు జరిగేవి, నిర్ణయాలు తీసుకోబడేవి. ఆ సమావేశాల్లో నేనెప్పుడూ పాల్గొనలేదు నా ముద్రికలో, నా సంతకంతో జారీ అయిన ఆజ్ఞల విషయానికి వస్తే. . సైన్యం వచ్చి యూరపియన్ అధికారులను వధించినప్పుడే నన్ను బందీని చేసారు; ఆ తర్వాత బందీగానే మిగిలిపోయాను. వారికి సక్రమమనిపించిన విధంగా పత్రాలను తయారు చేయించి, నా వద్దకు తెచ్చి ముద్ర వేయమని వత్తిడి పెట్టేవారు. కొన్నిసార్లు చిత్తుప్రతి తీసుకువచ్చి, నా కార్యదర్శిచేత నకళ్ళు తయారు చేయించేవారు. మరికొన్నిసార్లు సరాసరిగా అసలు ఆజ్ఞా పత్రాన్నే తీసుకువచ్చి, ప్రతులను నా కార్యాలయంలో వదిలేసేవారు. కనక అనేకమంది చేత తయారుచేయ బడిన అనేక చిత్తుప్రతులు నిర్వహణ క్రమంలో చేర్చబడేవి. తరచు ఏ చిరునామా

లేని కాళీ కవర్లపైన నా ముద్ర వేయించేవారు. నాకు ఆ ఉత్తరాల్లోని సంగతులూ తెలియవు; ఆ ఉత్తరాలు ఎవరికుద్దేశించబడ్డాయో ఎరగను నా బతుకే ప్రమాదంలో ఉండగా, ఈ విషయంలో చేయగలిగిందేమీ లేదు. .వారు నా సేవకులూ .రాణీ జీనత్ మహల్ బ్రిటిషువారితో కలిసిపోయారని . ఆరోపించారు. వారిని (సేవకులను) చంపుతామని కూడా వారు బెదిరించారు. రాణీని తమకు హామీగా అప్పగించవలసిందిగా కోరారు". ఒకసారి బహదూర్ షా ఎంతగానో "అలసిపోయి, నిస్సహాయుడైపోయి అనేక కష్టనష్టాలకు కారణభూతమైన చక్రవర్తి బిరుదాన్ని త్యజించాలని తీర్మానించు కున్నాడు". ఇంకా "మిగిలిన రోజులను భగవంతుని కిష్టమైన కార్యకలాపాల్లో గడిపివేయాలను"కున్నాడు. మరోసారి వజ్రాన్ని మింగి ఆత్మహత్య చేసుకుంటానని బెదిరించాడు.

ఆస్థానం రెండు విధాలైన సమావేశాలు జరిపేది; సామాన్య సమావేశం ప్రతి దినమూ ఎర్రకోటలో 5 గంటలపాటు సాగేది ; అత్యవసర వ్యవహారాలను చర్చించ డానికి, ప్రత్యేక సమావేశాలెప్పుడైనా- రాత్రి పగలు వ్యత్యాసం పాటించకుండా- జరపబడేవి. శీఘ్రంగానూ, సమైక్యంగానూ ఉండవలసిన అవసరాన్ని తిరుగుబాటు దారులు గ్రహించి ఉండాలి, ఎందుచేతనంటే స్వల్పమైన సూచనలను-తీర్మానాలను– వెంటనే తోసిపుచ్చడానికనుగుణమైన చర్చా క్రమాన్ని ఎన్నుకున్నారు. ఒక తీర్మా నానికి సవరణ ప్రతిపాదించాలంటే కనీసం నలుగురైనా (పదిమందితో) బలపర్చాలి. ఆ పైన, ముగ్గురి ఉపన్యాసాలు ముగిసీముగియంగానే త్వరితంగా తేల్చాల్సిన మిగతా పనుల వంకతో, ఆస్థానం ఆ సవరణను నెట్టివేసేది. అన్ని సందర్భాలలోనూ, ఆస్థానంలో అధిక సభ్యుల అంగీకారం తప్పనిసరి. ఏ సభ్యుడైనా హాజరు కానప్పుడు, అతని శాఖకు సంబంధించిన తీర్మానానికికూడా అతడు బాధ్యుడే. ఇది సమష్టి బాధ్యతను సూచిస్తుంది.

ఆస్థాన సమావేశాలు రహస్యంగా జరగాలని ఫర్మానా నిర్దేశం. ఆ విధంగా నిర్ణయాల రహస్యం కాపాడబడుతుంది. గూఢంగాకాని, సూటిగాకాని ఏ సభ్యుడైనా కార్యకలాపాల రహస్యం వెల్లడిస్తే . .ఆస్థానం నుంచి బహిష్కరించడమే శిక్ష. ప్రభుత్వాన్ని ఏ రకంగా మోసం చేసినా ఇదే శిక్ష. అలాగే ఒకవ్యక్తికో, వ్యక్తుల సమూహానికో పక్షపాతం చూపినా అంతే.

తిరుగుబాటుదారులు సూత్రీకరించిన నిర్ణయక్రమం సమగ్రమైనది కాదు. ఏ ఆధునిక రాజ్యపు పార్లమెంటరీ పద్ధతులకూ అనుగుణ్యం కాదు. తిరుగుబాటుదారులకు పార్లమెంటరీ ప్రభుత్వానుభవం లేదు; కార్యక్రమ నిర్వహణాసూత్రాల రచనతో

పరిచయం లేదు. అయినా . బహుశా పంచాయితీ పద్ధతి ఈ క్రమానికి ప్రతిపాదిక అయి ఉండవచ్చును. తమ వర్గపు సామాజిక రాజకీయ వ్యవస్థా రూపం సాంప్రదాయిక పంచాయత్, ఆ పద్ధతిలోనే ఆస్థానాన్ని సృష్టించి తమ ప్రజాస్వామ్య వాంఛను సంతృప్తి పరచుకున్నట్లు కనబడుతుంది.

1857 అగష్టు 8న జారీ చేయబడిన ఫర్మానాలో- ఇలాంటిదిదొక్కటే లభ్యమౌతోంది - ఆస్థానంలో జరిగే కార్యకలాపాల స్వభావానికి ఒక ఆధారం లభించింది. ఈ ఫర్మానాను, ఆస్థానపు ప్రత్యేక సమావేశానికి హాజరు కావలసిందని సభ్యులకు జారీ చేసిన ఆజ్ఞా పత్రమనుకోవచ్చును. దాని చర్చనీయాంశాల జాబితాలో ఈ క్రింది విషయాలున్నవి: ఢిల్లీ నగర సక్రమపాలనా సమస్య, సరఫరా నిర్వహణలో మెరుగుదల సాధించడం, మరింతసమర్థవంతంగా సైన్య నిర్వహణ, 'మహాజనుల'నుండి రుణ సేకరణ వగైరా. సైన్యపు క్రమశిక్షణ, అవినీతి అణచివేత, అధికార దుర్వినియోగం, దురాశా పూరిత చర్యలు మొదలైన విషయాలపై ఆస్థానం నుంచి ఆజ్ఞాపత్రాలు, సర్క్యులర్లు తరచుగా జారీ అయ్యేవి.

ఆస్థానం చెలాయించిన అధికారం విస్తృతం, సమగ్రం మాత్రమే కాదు; తన అధిపత్యాన్ని బాహ్యశక్తులు ఏమాత్రం తక్కువచేసినా ఆస్థానం సహించేది కాదు. ఉదాహరణకు సైనిక వ్యవహారాలలో చక్రవర్తికి గాని, రాజవంశీయులకుగాని లేశమాత్రం వాణి కూడా లేదు. 1857 జూన్ 26వ తేదీ లేఖలో చక్రవర్తి తన కుమారుడు మీర్జా మొఘల్‌తో ఇలా మొరపెట్టుకున్నాడు: "ఇదివరలో హయాత్ బక్ష్‌లోనూ, మెహతాబ్ ఉద్యానవనంలోనూ కొందరు సైనికులు నివాసం పెట్టారు. ఈ సైనికులున్నందువలన ఉద్యానవనం పాడై పోయిన కారణాన, మా ఆజ్ఞానుసారం వారు ఆ ప్రాంతాన్ని విడిచి పెట్టారు కాని ఇప్పుడు మరల ఇంచుమించు రెండు వందల మంది సైనికులు అక్కడ... మకాం పెట్టారు; అందుచేత నీవు ఆస్థాన సభ్యులతో మాట్లాడి ఆ సైనికులను అక్కడి నుంచి తొలిగి పోయేట్లు చేయవలెను." మరో సందర్భంలో సైనికోద్యోగుల ప్రవర్తనను నిరశించాడు. వారు "రాజరికం పట్ల గౌరవం చూపే పద్ధతులను పూర్తిగా వదిలిపెట్టి, నిర్లక్ష్యమైనదుస్తులతో కచ్చేరీ లోనికి వస్తున్నారు .. నాదిర్షా, అహ్మద్ షా, భారతదేశపు బ్రిటిష్ గవర్నర్ జనరలు . ఎవ్వరూకూడా గుర్రం మీద... ప్రవేశించని ప్రదేశాలకు వారు(సైనికోద్యోగులు) గుర్రంపై స్వారీ చేస్తూ వచ్చారు సైన్యం మనసా రాజ్య సంక్షేమాన్ని కోరుతోందా?"— అని చివరి మొగల్ చక్రవర్తి విలపించాడు.

ఇక రాజకుమారుల - వంశీయుల - పరిస్థితి మరింకా ఘోరం. వారికసలు ఏ

అధికారమూ లేదు. రాజరికపు ఆగలపు అడుగడుగునా 'తలబిరుసు,' 'మూర్ఖపు' సైన్యం ప్రతిబంధకమైపోయింది. మీర్జా మొగల్ చక్రవర్తికి వారసుడు; 1857 జూలై 1న వచ్చే వరకు తిరుగుబాటు సైన్యదళాలకు సర్వాధ్యక్షుడు - ఆ తర్వాత బఖ్త్ ఖాన్ ఆ పదవిని చేపట్టాడు. మీర్జా మొగల్ బహదూర్ షాకు ఇలా రాశాడు. "బఖ్త్ ఖాన్ ప్రవేశానికి ముందు, యుద్ధ కలాపాలు నిరంతరాయంగా ఏ అడ్డూ లేకుండా ప్రతి రోజూ కొనసాగేవని ప్రభువుల వారికి తెలుసు . ఈ రోజున నగరానికి వెలుపల నా దళాలతో శత్రువులపై దాడి చేయడానికి వెళితే అతడు అడ్డువచ్చి, మొత్తం సైన్యాన్ని కదలనీయకుండా నిలబెట్టాడు . ఎవరి ఆజ్ఞతో ఆ సైన్యం అక్కడికి తీసుకురాబడిందో తెలుసుకోగోరాడు; తన అనుమతి లేకుండా ముందుకు సాగరాదని ఆజ్ఞాపించాడు; (చివరకు) మమ్మల్ని వెనక్కు మరల జేసాడు."

మిర్జామొఘల్‌కూ, జనరల్ బఖ్త్‌ఖాన్‌కూ మధ్యనున్న పోరాటం వారివారి అనుచరుల వరకూ పాకింది. అదేమీ వ్యక్తిగతమైన కుమ్ములాటకాదు. వాస్తవానికి సైన్యంపై (పదాతులు) రాజరికం వారికే మాత్రమూ విశ్వాసం మిగలలేదు. రాజరికపు వారసునికీ, విప్లవ సేనానికి మధ్య రగిలిన అసూయ, ఘర్షణ, పోరాటం నిజానికి ఉపరితలానికి అట్టడుగున రాజరికానికీ, నూతనంగా ఆవిర్భవించిన కర్షక శక్తికీ మధ్యనున్న పోరాటమే. అందుచేత తిరుగుబాటు దారులు కొనసాగించదలచిన తీవ్రకార్యకలాపాలు భూస్వామ్య పాలకులను వ్యథపెట్టాయి. వారు పోరాటం సగంలోనే ఆసక్తి-ఉత్సాహం-కోల్పోయారు. "షహజాదాలు తమ పరిస్థితి ప్రమాదకరమైనదని భావించి, (బ్రిటిష వారితో) సంప్రదింపులు ప్రారంభించ ప్రయత్నించారు"—రెవరెండ్ కేవ్-బ్రౌన్.

(పాలక) ఆస్థానమే అత్యున్నతమైన న్యాయస్థానం కూడా. అది న్యాయస్థానాలను స్థాపించింది; న్యాయమూర్తులను నియమించింది; న్యాయ నిర్వహణా క్రమాన్ని- సివిల్, క్రిమినల్- సూత్రీకరించింది. పోలీసు అధికారులను, పౌర సంబంధమైన అధికారులనూ ..కూడా ఆస్థానమే నియమించింది; అధికారులు ఆస్థానానికే బాధ్యులు; వారిని పదవినుంచి ఆస్థానం తొలగించవచ్చును. లంచం, అవినీతి వీటిని రూపుమాపడానికి చాలా కఠినంగా వ్యవహరించింది. అధికారదుర్వినియోగం, పీడన .. విషయాలకు సంబంధించి సామాన్య పౌరుడుకూడా సరాసరి ఆస్థానంలో అభియోగం తీసుకురావచ్చును.

ఆర్థిక రంగంలో కూడా, ఆస్థానమే సర్వం. ఆస్థానమే రెవిన్యూ అధికారులను నియమిస్తుంది; తొలగించుతుంది. భూమిశిస్తు, మిగతా ఇతరమైన పన్నులు, లెవీలు వసూలుచేసే అధికారం ఆస్థానానికి దత్తం. ప్రభుత్వం తరపున ఆస్థానం మాత్రమే

అప్పులను సేకరిస్తుంది. మరే ఇతర అధికార కేంద్రం నుంచైనా రుణాల సేకరణకై ఫర్మానావస్తే . అధికారులు ఆ ఫర్మానాను ఆస్థానానికి వెంటనే చేర్చాలి. అప్పు ఇవ్వడానికెవరైనా తిరస్కరిస్తే, ఆస్థానపు ఆజ్ఞలు లేకుండా అతణ్ణి అదుపులోకి తీసుకోగూడదనికూడా అధికారులు ఆదేశింపబడ్డారు. మీర్జా సుల్తాన్ ఖిజర్ తనంతతాను రుణసేకరణకు ప్రయత్నించినపుడు, ఆస్థానం తీవ్రంగా ఆక్షేపించింది. ఇకపై రాజవంశీయులు అలా చేయకుండా చూడవలసిందిగా చక్రవర్తిని . కోరింది. ఆస్థానపు ప్రతినిధులకు మారుగా, రాజకుటుంబపు అధికారులద్వారా రుణసేకరణ జరగాలన్న మీర్జా మొగల్ సూచనకు చక్రవర్తి అంగీకరించలేదు. ఆ రకంగా రుణాలు ఎక్కువ లభిస్తాయని కూడ మీర్జా చెప్పినా సరే, అంగీకరించలేదు. ఆ వ్యవహారంలో ఆస్థానానికే మాత్రమే సంపూర్ణాధికారం వుందని చక్రవర్తి గుర్తుచేసాడు.

రుణాలను సేకరించే విషయంలో ఆస్థానం ఘోరంగా విఫలమైంది. సంపన్న వర్గాలవారు చాలా బయపడినట్లు కనిపిస్తోంది. రుణాలను సమర్పించ వలసిందని తిరుగుబాటు దారులు డబాయించినందుకో, లేదా "భూస్వామ్యత" రద్దు చేస్తామనే వారి "నవ్యత" కో .సంపన్నవర్గాలవారు మాత్రం భీతిల్లినట్లు కనబడుతోంది. రైతు-సైనికులకు వారి వర్గ స్వభావం వలన, భూమిని జాతీయం చేయాలనే భావం కలుగలేదు. 'మహాజనులు' (వ్యాపారస్థులు) బెదిరింపులు, ఒత్తిడి ఉన్నప్పుడు మినహా ..తమ డబ్బును వదలలేదు. టోకు వ్యాపారస్థులు, చిల్లర వ్యాపారస్థులు కూడా కొత్త ప్రభుత్వానికి అరువుగా సరుకులివ్వడానికి ఒప్పుకోలేదు, ఆ ప్రభుత్వం దివాళాకోరుదనీ, అస్థిరమైందనీ వారు సంపూర్ణంగా నమ్మారు. వారి అపనమ్మకానికి కారణం లేకపోలేదు. నగరంలో (ఢిల్లీలో) శాంతి భద్రతలను నెలకొల్పలేక పోయింది ఆస్థానం. దొంగ నిల్వలు, విపరీతమైన ధరలు, నల్లబజారు ..ప్రజలను దీనాతిదీనుల్ని చేసాయి. ఆర్థిక సంక్షోభాన్నుంచి దేశాన్ని ఉద్ధరించడానికి ఆస్థానం వీరోచిత ప్రయత్నాలు చేసిన మాట వాస్తవమే. ధరలను స్థిరీకరించి అదుపులో ఉంచడానికి ప్రయత్నించింది. రేషనింగ్, సరుకుల సరఫరాకు హామీ, సుస్థిర పాలనా వ్యవస్థ ...లేనందువల్ల ధరల అదుపు సఫలం కాలేదు.

ఆస్థానం భారీగా విచ్చలవిడిగా పన్నులు విధించాల్సిన పరిస్థితి ఏర్పడింది. అయితే ఈ పన్నుల భారం చెల్లించగల వారిపైన మాత్రమే పడింది; వాస్తవమే. పన్నుల విషయంలో తీసుకున్న చర్యలు 'వీధిమానిసి'ని స్పృశించలేదు. పైగా, ఆస్థానం వారికి కొంత వెసులుబాటు కల్పించడానికి ప్రయత్నించింది. జమీందారీ పద్ధతిని రద్దు చేసి వాస్తవంగా దున్నేవానికి భూమి హక్కు కల్పిస్తూ ఆజ్ఞలు జారీచేసింది. భూమి

పన్ను విధానాన్ని పూర్తిగా సంస్కరించాలని ఆస్థానం తలపెట్టినట్లుగా, అప్పుడు జారీ చేసిన ఆజ్ఞలను బట్టి గ్రహించవచ్చును. అయితే ఆ కార్యం నెరవేర్చడానికి తగిన వ్యవధి వారికి దక్కలేదు. వారిపాలనా కాలం స్వల్పం.

అదేమాదిరి పాలనా వ్యవస్థ లక్నోలోకూడ స్థాపించబడింది. ఢిల్లీ తిరుగుబాటు దారులవలెనే, లక్నో వీరులు కూడా బిర్జిస్ ఖాదర్‌ను-అవధ్ మాజీరాజు కొడుకు-సింహాసన మెక్కించారు. అతణ్ణి సింహాసన మెక్కించినప్పుడు-లేదంటే అతణ్ణి లక్నో అవధ్ నవాబ్ పజీరుగా ప్రకటించినపుడు-అంటే అతని అధికారం ఢిల్లీ చక్రవర్తి అధికారం అదుపులో ఉంటుంది-అతని తల్లి, మమ్మూఖాన్‌లు ఎంతో పెత్తనం చేయగలిగారు. కాని వారినా స్థితికి తెచ్చిన సైన్యం మనసు మారిపోగానే, వారి పెత్తనం అదుపై పోయింది.

అసలైన అధికారం ఒక మంత్రికీ, పాలకాస్థానానికీ దక్కింది. రాజుగారి ముఖ్య సేవకులు, రాజాలు, ఆ ప్రాంతపు పెద్ద భూస్వాములు, తమకు తాము ఆధిక్యత నాపాదించుకున్న సైన్యపు పెద్దలు .. ఆస్థానంలో సభ్యులు. 'బ్రిటీషువారిపై ఏ చర్యలు ఎలా తీసుకోవాలి?' అనే విషయాలను ఆస్థానం చర్చించింది. దానికొక సర్వ సైన్యాధిపతి ఉన్నాడు; ఇదివరకు సర్వసైన్యాధిపతి మాజీ రాజుగారి బావమరిది హిస్మత్-ఉద్-దౌలా. వివిధదళాలకు కమాండర్లను, బ్రిగేడియర్‌లను, కర్నల్‌లను .. ఆస్థానం నియమించింది. పటిష్టమైన నిర్మాణంతో క్రమపద్ధతిలో ఉన్న సైన్యంలాగానే పైకి అనిపిస్తుంది. అయితే వాస్తవానికి, సిపాయిలే తమ అధికారులను ఎన్నుకునేవారు; అలాగే అధికారులు కమాండర్లను ఎన్నుకొనేవారు-పేరు మాత్రం రాజుగారిది. కాని వారు సిపాయిలను చిరాకుపెడితే, వెంటనే సిపాయిలు ఒకచర్చాసమావేశాన్ని పిలిచి. .. పైవారిని క్రిందికి దించడమో. ..మట్టుపెట్టడమో ..చేసేవారు-ఇలా తక్కువసార్లు జరగలేదు. కొత్తగా పదవులు పొందినవారికి గౌరవం లభించలేదు. అలాగే వారి పట్ల విధేయత కూడా లేదు-నిజానికి సుశిక్షితమైన సైన్యంలోఉన్న సంప్రదాయాలు పోయాయన్న మాట. మరీ ఉన్నతమైన వారి విషయం మినహాయిస్తే, సైన్యాధికారుల కార్యాలయాలన్నీ ప్రమాద భూయిష్టాలే; తిరుగుబాటు సేనలు తమ కమాండర్ల ఆజ్ఞలు పాటించలేదు; వారి ఇష్టంవచ్చినట్లు చేసారు.

## వివిధ వర్గాల పాత్ర

సైనికులలో ప్రజాస్వామ్య భావం పెంపొందడం చూసి ఉన్నతవర్గాలవారు గజగజలాడారు. తిరుగుబాటు ఫలితాలపై వారికి అనుమానాలు పెరిగాయి. తిరుగుబాటు

తొలి ఉత్సాహానంతరం వారి ఉద్వేగం చల్లారిపోయింది.

ఆ పోరాట సమయంలో ఉన్నతవర్గాల-ముఖ్యంగా తాలూక్దార్లు, జమీందారులు, షాహుకార్లు-మారిన ధోరణి దీన్ని స్పష్టం చేస్తుంది. షుమారుగా 1857 జూలై 1 న ముగిసిన తొలిదశలో-ఢిల్లీలో ఆస్థాన నిర్మాణం జరిగిన రోజువరకు- " ..తాలూక్దార్లు ఒక్కుమ్మడిగా లేచి . తమ ఎస్టేట్లు పొందినవారిపై బడి తరిమివేసారు". ఈ పరిస్థితిని హెన్రీ సెంట్ జార్జి టకర్ ఇలా వర్ణించాడు: "పెద్ద పెద్ద భూస్వాములూ, వేలంలో ఆస్తులు సంపాదించినవారూ నిశ్చేష్టులైపోయారు, నిరాశ్రయులైపోయారు· తరచుగా వారి ప్రతినిధులు హత్యలకు లోనయ్యేవారు, వారి ఆస్తి ధ్వంసం చేయబడేది".

కాని బ్రిటిషు అధికారం అదృశ్యం కావడంతో, 'స్వేచ్ఛా'భావం రూపుదిద్దుకో పడం ప్రారంభమైంది. సిపాయిలూ, సామాన్య ప్రజలూ కూడా .. పొలాలను ఆక్ర మించుకోవడం, పట్టణాలలో "దోచివేయడం", ప్రభుత్వపత్రాలను ధ్వంసం చేయడం మొదలుపెట్టారు. అలాంటి ఒకానొక పరిస్థితిలో, బీహార్ తిరుగుబాటుదారులకు నాయ కత్వం వహించిన కున్వర్‌సింగ్-అతడే ఒక భూస్వామి కూడా - తన అనుచరులు అలాంటి దుశ్చర్యలకు పాల్పడకుండా నిరోధించాడు. దాని కతడు చెప్పిన కారణం: "కానట్లయితే-అంటే ఇలా దోపిడీలు ఆపకపోతే-బ్రిటిషువారిని మన దేశంనుండి తరిమి వేసిన తర్వాత, ప్రజల హక్కులకు సంబంధించిన రుజువు మిగలదు; ఒకరినుంచి మరొకరికి ఎంత బాకీ ఉందో నిర్ణయించడానికి ఆధారం ఉండదు".

ఏమైనా, ఆయా ప్రాంతాలలో ముఖ్యంగా సాయుధ సమూహాలే సర్వాధికారులు; కలవారిని ఇష్టంవచ్చినట్లుగా కొల్లగొట్టారు. "ప్రతిదుకాణమూ పూర్తిగా దోచివేయ బడింది; దోచివేయబడటమే కాదు, ధ్వంసం చేయబడింది. తలుపులు ఊడగొట్టబడ్డాయి; వరండాలు కూల్చబడ్డాయి; నేలంతా తవ్వివేయ బడ్డది; గోడలకు పెద్దపెద్ద రంధ్రాలు చేయబడ్డాయి. మోయడానికి సాధ్యమైనదంతా గ్రామాలకు చేరింది; మిగిలింది వీధుల్లో ఉండిపోయింది. చిరిగిపోయిన ఖాతా పుస్తకాలు, పగిలిపోయిన సీసాలు, జాడీల పెంకులు, పెట్టెల శిథిలాలు, వరండాల చెత్త, మన్ను ..తో వీధులు నిండిపోయాయి." అని రాశాడు మార్క్ థార్న్‌హిల్. పోగొట్టుకోవడానికి కూస్తో కాస్తో ఉన్న ప్రతి వాడూ సిపాయిలను శపించాడు. "తిరుగుబాటుదారులలో ఎక్కువమందికి పోయేదేమీ లేదు; వారు పాలితులే; పాలకవర్గంవారు కాదు." అని సర్ సయ్యద్ అహ్మద్ ఖాన్ వ్యాఖ్యానించాడు. అందువలన ఉన్నత వర్గాలవారు తిరుగుబాటు విజయం పొందు తుందంటే - వీగిపోతుందంటే కాదు - భయపడసాగారు. తిరుగుబాటు సాఫల్యం వల్ల తమ సంపూర్ణ నాశనం జరుగుతుందని వారు భావించారు. "తిరుగుబాటు దారులతో

చేతులు కలపడం వలన తమ వాంఛలు నెరవేరవని వారు స్పష్టంగా గ్రహించారు." లక్నోను పట్టుకున్న తర్వాత రెండో వారానికే తిరుగుబాటుదారులకు "అవధ్ తాలూక్దారుల నుండి కొత్త బలగం చేరేటట్లు కనిపించలేదు."

సామాన్య ప్రజలు తిరుగుబాటుకు నాయకులుగా రూపొత్తినందువలననే 1857 సెప్టెంబర్ 17న జనరల్ ఔట్రాం ఇలా వ్యాఖ్యానించవలసి వచ్చింది: "అవధ్‌లోని అతి శక్తివంతమైన, అత్యధిక సంఖ్యాకులైన మధ్య తరగతి ముఖ్యులకూ, జమిందార్లకు చెందిన విస్తృతమైన పలుకుబడి గల వర్గం మన పాలనను మనసారా కోరుకుంటున్నారు." లెఫ్టినెంట్- జనరల్ మెక్లియాడ్ ఇన్నెస్: "వారిలో ఎక్కువమంది నామకః తిరుగుబాటులో పాల్గొన్నారు కాని నిజంగా కాదు" అనికూడా ధృఢ విశ్వాసాన్ని వ్యక్తం చేసాడు. వారిలో కొందరు "నాయుధ తాటస్థ్యాన్ని" పాటించారు. కొందరు "అడిగిన మేరకు మాత్రమే దళాలను తిరుగుబాటు శిబిరానికి పంపి, వ్యక్తిగతంగా ప్రేక్షకులుగా ఉండిపోయారు." ఇంకా మరికొందరు "బ్రిటిషు అధికారులకు . తిరుగుబాటుదారుల కదలికలను గురించీ, వారి ఆయుధ లోపాన్ని గురించీ .. సమాచారం అందచేసే వారు." కొందరు తాలూక్దార్లు, బనియాలు బ్రిటీషు సైన్యాలకు అవసరమైన సామగ్రిని కూడా సరఫరా చేసారు; బ్రిటిషు కాందిశీకులకు రక్షణ కల్పించారు. కేయే ఇలా రాశాడు: "శాంతిభద్రతలపై ఆసక్తి ఉన్న కొందరు శక్తిమంతులైన రాజాలు సంఘర్షణ తీవ్రదశకు చేరుకున్నపుడు ఇంగ్లీషు వారి పక్షాన చేరారు. లేదంటే అప్రమత్తమైన తాటస్థ్యం చూపారు." హోమ్స్ ఇలా రాశాడు: "పలుకుబడిగల భూస్వాముల సమూహంలో కొందరు నిస్సందేహంగా మనకు వ్యతిరేకమే; చెప్పుకోదగినంత మంది ఏమీ చెయ్యకుండా మనపట్ల విశ్వాసం కనపర్చారు. చాలా కొద్దిమంది సాహసవంతంగా రంగంలో దూకి తిరుగుబాటు ఉధృతాన్ని ఆపడానికె తమ శక్తిని ప్రయోగించారు." 1858 మార్చి 20న కానింగ్ ప్రకటన వెలువడడానికి ముందు ఏ తాలూక్దారైనా తిరుగుబాటు దారులతో స్వయంగా మిలాఖత్ అయ్యాడనడానికి సాక్ష్యాధారమేదీ జనరల్ ఔట్రాంకు లభించలేదు.

అయితే ఈ ప్రవర్తనకు "పూర్తి విరుద్ధంగా" తాలూక్దార్లు "కానింగ్ ప్రకటన ప్రచురించిన వెంటనే ఒక్కుమ్మడిగా తిరుగుబాటు చేసారు". ప్రత్యేకంగా పేర్కొనబడిన ఆరుగురు వ్యక్తులకూ, తిరుగుబాటు కాలంలో విధేయంగా ఉన్నామని ప్రభుత్వానికి సంతృప్తికరంగా రుజువు చేయగలిగిన వారికీ . చెందిన భూములు మినహా రాష్ట్రంలోని భూములన్నీ ప్రభుత్వం స్వాధీనమై నట్లేనని కానింగ్ ప్రకటన సారాంశం. పద్దబడిన ఈ నిర్ణయం తిరుగుబాటుకు "అనుకూలమైన" అంశాన్నిచ్చింది; అప్పటికే

డిల్లీ, లక్నో, కాన్పూరు, బెనారస్, అలహాబాదులు అయిపోయాయి. దెబ్బతిని ఉన్నారు. అంతర్గత విభేదాలు, ఆర్థిక సంక్షోభం . ఎదురయ్యాయి. ఇందువల్ల బ్రిటీషు వారికి వ్యతిరేకంగా, ఈ చొచ్చుకు వస్తున్న సామాన్యులతో గాఢంగా కలిసి పోతే, సంప్రదాయ ఆర్థిక, సామాజిక నిర్మాణానికి దెబ్బ తగులుతుందనే భయం తాలూక్దార్లలో తొలిగిపోయింది.

ఈ ప్రకటన ద్వారా సంక్రమించే ప్రమాదకర ఫలితాలను గుర్తించిన సర్ జార్జి కాంప్ బెల్ ప్రకటనాంశాలను అమలు చేయవలదని ప్రభుత్వానికి సలహానిచ్చాడు. పైగా 'జరిగిందేదో జరిగింది' అని తాలూక్దార్లకు ఊరట కల్పించ వలసిందిగా కోరాడు. ఎందుచేతనంటే వారిలో కొందరు సర్ హెన్రీ లారెన్సు మెతక విధానాల వల్ల సంతృప్తులైనవారు. పైగా లక్నో రెసిడెన్సీకి సరుకులు సరఫరా చేసారు. అవధ్‌లో తిరుగుబాటు తర్వాత బ్రిటిషు కాందిశీకులకు సహాయ పడ్డారు. తాలూక్దార్లను "గౌరవనీయమైన శత్రువులుగా" పరిగణించి వారి భూమి హక్కులను శాశ్వతం చేయవలసిందని గవర్నర్ జనరల్‌కు చెప్పాడు జనరల్ ఔట్రాం. తాలూక్దార్లకు వారి బతుకు, జైలునుంచి స్వేచ్ఛ కంటే అదనంగా మరేదీ ఇవ్వక పోయినట్లైతే, వారు గెరిల్లా యుద్ధానికి దిగే పరిస్థితి కల్పించి నట్లౌతుందనీ, తద్వారా యుద్ధం వలన, రోగాల వలన, తిరుగుడు వలన వేలాది యూరపియనులకు ప్రాణ నష్టం సంభవిస్తుందనీ .. ఔట్రాం హెచ్చరించాడు. మరోవైపున వారి భూములు వారికి స్వాధీనం చేసినట్లయితే, శాంతిభద్రతలు నెల కొలపడానికి వారి శక్తిసామర్థ్యాలు ప్రభుత్వానికి సహకరిస్తాయనికూడా చెప్పాడు. భూస్వామ్య ప్రభువులను తమవైపు తిప్పుకోవడానికి జనరల్ ఔట్రాం చేసిన సూచన లార్డ్ కానింగ్ అంగీకరించక తప్పలేదు. అంత తీవ్ర పరిస్థితి ఉంది. వారికి (తాలూక్దార్లకు) ఉచితమైన ఏర్పాటు చేసిపెడతానని కానింగ్ ప్రకటించాడు; దానికి క్షణాలమీద ఫలితం లభించింది. 1858 అక్టోబర్ 22న అవధ్‌లో ఇంకా తిరుగుబాటు రగులుతుండగానే, అవధ్ బేగమ్ గారి వకీలు బ్రిటిషు సర్వసేనాని శిబిరానికి వెళ్ళాడు. బేగమ్‌కు ఏ వెసులుబాటులు కల్పించగలరో తెలుసుకోవడానికి ఆ వకీలు వచ్చాడు. దొరక్కుండా ఉన్న రాజాలు, తాలూక్దార్లు కూడా- అలాంటి వ్యవహారాలపైననే- తమ ప్రతినిధులను అప్పటికే పంపారు.

అందువలన, తిరుగుబాటు తర్వాత "తాలూక్దార్లు తమ ఎస్టేట్లను తిరిగి సంపాదించడమేకాక, తామెప్పుడూ ఆశించని అసాధారణ సౌకర్యాలనుకూడా పొందగలిగారు; ఈ ప్రత్యేక హక్కులు కొనసాగించ బడతాయని ప్రభుత్వం వాగ్దానాలుకూడా చేసింది." తిరుగుబాటు తర్వాత మూడింట రెండు వంతుల భూమి పెద్ద భూస్వాముల స్వాధీన

మయ్యింది— అవధ్‌ను కలిపివేసుకున్నప్పుడున్న కౌలురేటు దానికి ప్రమాణం. ఇది తిరుగుబాటుకు వారు చేసిన ద్రోహానికి ఖరీదు. 'భూస్వాముల స్వాధీనం ఆజ్ఞ' అనంతరం వారు సంపాదించింది, తిరుగుబాటుకు ముందు వారు కోరిందానికంటే ఎంతో ఎక్కువ. ఆక్రమించడానికి వచ్చిన బ్రిటిషు సైన్యానికి "ముఖ్యమైన భూస్వాములూ, గౌరవనీయ గ్రామీణులూ సంతోషపూర్వకంగా స్వాగతం చెప్పారంటే" ఆశ్చర్యం లేదు మరి.

ఢిల్లీలోనూ ఇదే కథ. తిరుగుబాటుదారులు మొగలు రాజధానిలో ప్రవేశించి, లాంఛనంగా బహదూర్‌షాను భారత చక్రవర్తిగా ప్రకటించి, . నగరాన్ని ఆక్రమించారు. "అంతా గందరగోళం; గజిబిజి" అని బ్రిటిషు గూఢచారి రజబ్ ఆలీ నివేదిక. నవాబ్ మొయినుద్దీన్ ఆ సన్నివేశాన్ని ఇలా వర్ణించాడు: "వారు చక్రవర్తిని 'నిన్నే! రాజా!' 'ముసలాడా! నిన్నే' (అర్రే బాద్షా! అర్రే బుడ్ఢా) అని అమర్యాదకరంగా పిలిచారు. "విను" అని ఒకడంటే "ఇటు విను" అని మరొకడు. ఒకడు చేయి పట్టుకుంటే మరొకడు గడ్డం పట్టుకున్నాడు. ఆ ప్రవర్తనకు ఉగ్రుడై, వారి మూర్ఖత్వాన్ని నిరోధించలేక .. తన అనుచరుల వద్ద తన దైన్యాన్ని, దురదృష్టాన్ని దుఃఖంతో వెల్లడించి కొంచెం సేదతేరాడు చక్రవర్తి. ఇంతకు పూర్వం ఆయన ఆజ్ఞలను అందుకోవడానికి వినయంగా సంతోషంగా సిద్ధంగా ఉన్నవారుకూడా ..ఆయనను ఎగతాళి చేయడానికి, కించపరచడానికి ఏమాత్రం వెరపు చూపించలేదు. ఆయన రాణిని అనేకసార్లు అరెస్టుచేస్తామని బెదిరించారు; ఆయనపుత్రులను డూడూబసవన్నలను చేసారు. దీనికంతా చికాకుచెంది సిపాయిలను నగరం వదలిపోవలసిందిగా బహదూర్ షా ఆజ్ఞాపించాడు. ఆయన ఆజ్ఞలూ, విజ్ఞప్తులూ గాలికిపోగా, బ్రిటిషు వారితో సంప్రదింపులు జరపాలని భావించాడు; కాని అందుకాయన అశక్తుడు. అది 1857 జూలై 24న. ఆ తర్వాత ఆయన ఫకీరునై పోదామనీ, లేదంటే 'సామ్రాజ్య భారాన్ని' జైపూర్, జోధ్‌పూర్, బికనీర్, ఆల్వారు పాలకుల చేతుల్లో పెట్టాలనీ . రెండు రకాలుగా ఊగిసలాడాడు. "అతి ముఖ్యమైన సామ్రాజ్య వ్యవహారాలను సరిదిద్ది పరిపాలించగల" నమ్మకస్తులు ఆయనకు కనిపించలేదు. పైన చెప్పిన నలుగురు పాలకుల నుండీ అవసరమైన సమాధానం పొందలేనందువల్ల "హిందుస్థాన్ చక్రవర్తి బహదూర్ షా షరతులను నిర్ణయించడానికి (బ్రిటిషు వారి వద్దకు తన ప్రతినిధులను) పంపాడు."

భారత చక్రవర్తి గతి అలా ఉన్నప్పుడు, సామాన్య భూస్వామ్య (లాభాపేక్షగల) వర్గాల వారి పరిస్థితి ఎలా ఉంటుందో ఊహించడం సులభమే. తమ ఆస్థి దోపిడీకి, విధ్వంసనకూ గురికాకుండా ఉండడానికి వారు 'నెలసరి చెల్లింపు పద్ధతిమీద

సైన్య దళాన్ని కొనడానికి' నిర్ణయించుకున్నారు. తర్వాత దోపిడి నుంచి, హింసా కాండనుంచి... రక్షించుకోవడానికి సొంత పోలీసు దళాన్ని ఏర్పరుచుకున్నారు. అయితే ఆ ఏర్పాట్లు విఫల మయ్యాయి. ఆగష్టు 20న నగర బ్యాంకర్లు సిపాయిల ఒత్తిళ్ళను సమష్టిగా ఎదుర్కోవాలని నిర్ణయించుకున్నారు. అరువుగా సరుకులు అమ్మడానికి వ్యాపారస్థులు నిరాకరించినందువల్ల ఆకలికి తట్టుకోలేక ..సిపాయిలు హద్దూ పద్దూలేకుండా లూటీలు ప్రారంభించారు. మొత్తం నగరాన్ని నేలమట్టం చేస్తామని బెదిరించారు. ప్రతిరోజూ అసంఖ్యాకంగా బ్యాంకర్లు, వ్యాపారస్థులు, పూర్వపు రాజాస్థానోద్యోగులు, రాజ వంశీయులు .డబ్బుకోసమై వేధించబడేవారు.

సంపన్న వర్గాలవారు సిపాయిలకు ఐచ్ఛికంగా సహకరించడం మానేసారు. వారు తమ ప్రాణాలను, ఆస్తినీ కాపాడుకోవడాని కవసరమైనమేరకు-అదీ ఒత్తిడివలన-సహాయపడేవారు. వారు తమ ఆస్తిపాస్తులను ఎక్కడో పాతిపెట్టేవారు. చెల్లింపులేకుండా సరుకులు సరఫరా చేసేవారుకాదు. ఆగస్టు 30న దోలాలిమల్లు-ఆహార సరఫరా శాఖాధిపతి-సైన్యదళాలకు ఇక ఏమాత్రం ఆహారం సరఫరా చేయలేనని చెప్పేసాడు. ఆ తర్వాతి రోజున ములాహీ లాలా ముత్రిడీ (**Mulahi Lala Muthridi**)-గుత్తదారు-'ఇకపై గంధకం కొనజాలమనీ, అందువలన తుపాకీమందు తయారీ నిలిపివేయాలనీ' అర్జీ పెట్టాడు. "కొల్లగొట్టిన ధనంతో బలిసిన సిపాయిలు నగరాన్ని వదలిపెట్టలేరు; దాన్ని రక్షింపలేరు" అని ఉన్నతవర్గాలవారు నిశ్చయానికి వచ్చారు. వారు తమ సంపద పెంచుకోవడానికే ఉండిపోయారు. ఆ విధంగా "యుద్ధం తెచ్చిపెట్టిన అసహ్యవేదనా, అరాచకత్వపు ఘోర నిర్వేదమూ ప్రజలను - దుకాణదారులు, చిల్లర వ్యాపారులు-ఇంకా ఇతర సంపన్నవర్గాలనూ చుట్టుముట్టాయి"—. "బ్రిటిష్ ప్రభుత్వంతో సర్దుబాట్లు చేసుకోవడానికి ముఫ్తీ సదర్-ఉద్దీన్.. హకీం అహ్సాన్ఉల్లాఖాన్, మీర్జా ఎలాహి బక్ష్, బేగమ్ జీనత్మహల్ లు ఎంత తీవ్రంగా ప్రయత్నించారో మాకొక మహమ్మదీయ వార్తాహరుడు తెలియజేసాడు" రాజుగారు, కులీనులు, ఢిల్లీ పౌరులు అమాయకులు, నిస్సహాయులు కనక వారిపట్ల ప్రత్యేక కారుణ్యం చూపాలని అడగబడింది"అని ఫ్రెడరిక్ కూపర్ రాసాడు.

ఈ కథ బెంగాల్లోకూడా పునరావృతమైంది. జమీందారులు బ్రిటిష్ వారికి పూర్తిగా విధేయులుగా ఉండిపోయారు. వారి విధేయతకు కారణం తేలిగ్గా అర్థంచేసుకోవచ్చును. తిరుగుబాటుకాలంలో బీహారు రైతాంగం (బీహారు, బెంగాలు రాష్ట్రంలో భాగం) బ్రిటిష్వారికి వ్యతిరేకంగానేకాక, జమీందార్లకూ, వారి ప్రతినిధులకూ కూడా వ్యతిరేకంగా వీధిన పడ్డారు. 1857 డిసెంబర్లో బెంగాలీ జమీందారులు గవర్నరు-

జనరల్‌కు సమర్పించిన నివేదికలో "అతి ప్రముఖంగా తమ ప్రయోజనాలను పాలకుం ప్రయోజనాలతో సమానంచేసి చూసారు .. తిరుగుబాటు సంఘటనల్లో తిరుగుబాటుదారులు, తప్పుదారినపడిన సహదేశీయులు తమ కందుబాటులోఉన్న బ్రిటిషువారిపట్ల ఎలా ప్రవర్తించారో అదేవిధంగా వారి (జమీందారుల) పట్ల కూడా ప్రవర్తించారు"— అని వివరించారు.

తిరుగుబాటు వ్యాపించిన ప్రాంతాల్లోని గ్రామాలలోనూ, పట్టణాల్లోనూ . . చురుకైన వ్యాపారులూ, అత్యాశాపరులైన వడ్డీ వ్యాపారస్తులూ- బ్రిటిష భూమిశిస్తు విధానం వలనా, న్యాయవిధానం వలనా బాగుపడినవారు-తమకు సాధ్యపడినంతకాలమూ కంపెనీ ప్రభుత్వానికి సహాయ పడ్డారు; తిరుగుబాటుదారులకు తప్పుకోవడానికి వీలులేనప్పుడు మాత్రమే తోడ్పడ్డారు. తిరుగుబాటుదారుల విజయం అంటే తమ క్షేమాత్రము స్థానంలేని పాతపాలనా వ్యవస్థ పునరుద్ధరణ అనికూడా వారు అభిప్రాయ పడ్డారు. అందుచేత వారు "శాంతిభద్రతల" పునరుద్ధరణకే వారు తహతహలాడారు. అదే "రోజువారీ వ్యాపారం కొనసాగడం" అని కూడా వారు భావించారు. ఇది బ్రిటిష్ పాలనలో మాత్రమే సాధ్యపడుతుంది. "బనియాలు తప్ప-ఆ పరిస్థితిలో ఇబ్బందిపడ్డవారు-మిగతా వర్గాలవారు ఆ గందరగోళానికి సంతోషించారు" అని థార్న్‌హిల్ అన్న మాట విషయాన్ని స్పష్టం చేస్తుంది. "ఈ గడబిడలో సంపాదించుకున్నదానికంటే పోగొట్టుకొన్నదే అధికమైనప్పటికీ" పరిస్థితులపట్ల సంతోషాన్ని వ్యక్తంచేసిన వ్యాపారవర్గాల దృక్పథంలో "ఎంతో నిజాయితీ" ఉందని కేయే వ్యాఖ్యానించాడు.

తీరప్రాంతాల్లోనూ, తిరుగుబాటు ప్రభావం పడని చోటుల్లోను ... వ్యాపారులూ, బ్యాంకర్లూ బ్రిటిష్‌వారికి సూటిగా సహాయపడ్డారు. కొద్ది వ్యవధిలోనే "విముక్తప్రాంతాలలో'' తమ వర్గానికి చెందిన వారి ఆస్తులు పలుమార్లు దోచబడ్డాయని వారు విన్నారు. భూస్వామ్య ప్రభువుల పతాకం నీడనగానీ, తిరగబడ్డ సైనికులు, పేదరైతులు నాయకత్వం వహించిన సందర్భంలోగాని . తిరుగుబాటు విజయం అంటే తమ అంతమేనని వారు దృఢంగా నమ్మారు. "బనియాలు . స్థానిక గుత్తదారులు కంపెనీ ప్రభుత్వపు సామర్థ్యంపై విశ్వాసాన్నెప్పుడూ వీడలేదు. వారెప్పుడూ "దొరగారూ! కొద్దిసేపు ఓపిక పట్టండి; ఈ తిరుగుబాటుదారులు దుమ్ములో కలిసిపోతారు కంపెనీ అంటే దైవం" అంటూండేవారు. హోమ్స్ దృష్టిలో "వ్యాపార, దుకాణదారుల వర్గాలవారు .. తమ స్థితి, అభివృద్ధి శాంతియుత పరిపాలనతో ముడిపడి ఉన్నాయనీ, దాన్ని ఛిద్రం చేస్తే అరాచకంమధ్య సర్వనాశనం తప్పదనీ" వారు భావించి గంభీరంగా నిలబడ్డారు— కొందరు ప్రభుత్వానికి పూర్తి విధేయతను కనబరచి ఉండకపోవచ్చు. భారతదేశంలో

బ్రిటిష్‌పాలన ముగియబోతోందనే వదంతులకు వారి చెవి ఒగ్గలేదు. విధేయ చర్యలు, సేవలు ...చేయడానికి పోటీలమీద సంసిద్ధతను వ్యక్తపరిచారు.

ఎక్కువగా వ్యాపారుల వర్గానికిచెందిన పార్శీలు బ్రిటిషువారికి సహాయపడడానికి మరో కారణముంది. "వారు సంపన్నులైనారంటే కారణం హిందువులు, ముసల్మానులు కాదు వారు బ్రిటిష్‌వారివైపు ఒరిగారంటే కారణం ఒకటే. బ్రిటిషువారి న్యాయం, సమానతా చట్టాలు వారిని ఇతరుల ద్వేషాన్నుంచి, క్రోధాన్నుంచీ రక్షించాయి—అంతకుముందు పాలనలో వారనుభవించినవే ...ఇటీవలి తిరుగుబాటులో వారు బ్రిటిషు వారితో సమానంగా-కొన్నిసార్లు అంతకంటే అధికంగా-తిరుగుబాటుదారుల చేతుల్లో బాధలుపడ్డారు .ఈ వ్యాపారులనుండి మనం విజయయాత్రకవసరమైన వాటి నన్నింటినీ సంపాదించగలిగాం" అని వివరించాడు లోవె.

ఇంగ్లీషు నేర్చుకున్న భారతీయులు, ప్రాంతపు అధికారవర్గం ఇంచుమించుగా తిరుగుబాటులో చేరలేదు. ఈ సంఘర్షణ సమయంలో మొదటివర్గంవారు 'విధేయంగా' ఉంటే, రెండోవర్గంవారు తమ నిర్ణీత స్థానాల్లో "సాహసోపేతంగా నిలబడిపోయారు". తిరుగుబాటుపట్ల వారి వైముఖ్యం స్వప్రయోజనంపై ఆధారపడిందే. పాదుషాగారిపాలన తిరిగి వస్తే, తమపని 'గల్లంతే'నని వారికి తెలుసు. పర్షియన్ భాషరాదు; ప్రాచ్య సంప్రదాయాలు తెలియవు. కులీన జన్మకాదు ...కనకవారికి సామాజిక, రాజకీయ నిర్మాణంలో చోటెక్కడా లభించదు.

తిరుగుబాటు రెండేళ్ళ స్వల్పకాలంలోనే అణచివేయబడింది. అది అంత సులభంగా అణచివేయబడడానికి సంపన్నవర్గాల ద్రోహమే కారణం. వారు స్వతంత్రులుగా ఆత్మహత్య చేసుకుని, తమ వర్గ ప్రయోజనాలను సంరక్షించుకున్నారు. పాలకులెవరూ తిరుగుబాటులో పాల్గొనలేదు-ఎందుచేతనంటే కానింగ్‌వారికి దత్తత చేసుకుని రాజ్యానికి వారసులను నియమించుకునే హక్కును శాశ్వతంగా ఖాయంచేశాడు. ఈ రాజాలలోనూ, రాణులలోనూ ఝాన్సీ లక్ష్మీబాయి మాత్రమే బ్రిటిష్‌వారినెదిరించి ప్రాణాలను ఒడ్డింది. అయితే ఆమె బ్రిటిష్‌వారితో పోరాటం 1858 మార్చిలో ప్రారంభించింది- ఝాన్సీలో చెలరేగిన తిరుగుబాటుకూ, తద్వారా జరిగిన మారణకాండకూ ...తనకూ సంబంధం లేదని బ్రిటిష్‌వారిని ఒప్పించడానికి చేసిన ప్రయత్నాలు విఫలమైనతర్వాత ఆమె ఎదురుతిరిగింది. బహదూర్‌షా వత్తిడివల్ల పోరాటంలో పాల్గొన్నాడు. నానాసాహెబ్, సైన్యం చేతిలో ఖైదీగా మాత్రమే, బ్రిటిష్‌వారి నెదుర్కొన్నాడు. బ్రిటిష్‌కాలంలోను, అంతకుమునుపూ జమీందారులైనవారూ, వ్యాపారస్తులు, వడ్డీవ్యాపారులు, విద్యావంతులైన మధ్యతరగతి వర్గంవారు, ప్రాంతపు అధికార బృందం....అందరూ పరిస్థితులను

బట్టి బ్రిటిష్‌వారికి సహకరించారు లేదంటే "తటస్థత"ను పాటించారు. ఒకవైపున సాహస వంతమైన భారతీయ రైతాంగం అటు విదేశీ శృంఖలాలనూ, ఇటు భూస్వామ్య బంధ నాలనూ.... తెగగొట్టడానికి పోరాడుతుంటే ఈ పైన చెప్పబడినవారందరూ బ్రిటిషు వారిని జగద్రక్షకులుగా భావించారు· బ్రిటిష్ పాలనకు ముందున్న పాత, తుప్పట్టిన ఆర్థిక విధానాన్ని పునరుద్ధరించాలని ఈ తిరుగుబాటు తొలి లక్ష్యమయినప్పటికీ,—-"ప్రాచ్య నియంతృత్వానికి పటిష్టమయిన పునాది"- తిరుగుబాటు దేశీయ భూస్వామ్య విధానానికీ, విదేశీయ సామ్రాజ్య వాదానికీ వ్యతిరేకమైన రైతాంగ పోరాటంగా ముగిసింది.

## వైఫల్యానికి కారణాలు

రాజకీయ, ఆర్థిక స్వాతంత్ర్యానికి భారతదేశం జరిపిన పోరాటంలో తిరుగుబాటు దారుల ఓటమికి, సంపన్న వర్గాల ద్రోహంతోపాటు ... అనేకమైన ఇతర కారణాలు కూడా తోడ్పడ్డాయి. సమర్థుడైన సైన్యనాయకుణ్ణి ఒక్కరినికూడ తిరుగుబాటు సృష్టించ లేకపోవడం ఆశ్చర్యకరం. బ్రిటీషువారు లక్నోలో చూపెట్టిన మొండి ప్రతిఘటనతో ... తిరుగుబాటుదారులు ఢిల్లీ, ఝాన్సీ లేదా గ్వాలియర్‌లలో ప్రదర్శించిన ప్రతిఘటనతో పోల్చిచూస్తే ఈ విషయం మరింత విశదమౌతుంది. భారతీయులుకూడ అనేక అద్భుత విజయాలు సాధించినమాట నిజమే! కాని ఈ విజయాలు సంఖ్యాబలం వల్ల లభించినవే గాని, ఉత్తమ వ్యూహరచన, ఎత్తుగడల వలన మాత్రం కాదు. "వారిలో (తిరుగుబాటు దారులలో) ఒక్కడైనా సైన్యాధిపతి ఆవిర్భవించివుంటే.... మనమీసరికి అన్నీ కోల్పోయే వాళ్లం." అని జాన్ లారెన్స్ సరిగానే వ్యాఖ్యానించాడు. ఆపైన తిరుగుబాటు లేచిన సమయానికి క్రిమియాయుద్ధం, పర్షియాతో యుద్ధం, ముగిసిపోయాయి. బ్రిటీషు సైన్యం సర్వ సంసిద్ధ స్థితిలో ఉంది. అప్పుడే ఆఫ్‌గన్‌స్థాన్‌తో నూతన మిత్రసంధి కూడా జరి గింది. అంటే ఖైబర్ కనుమగుండా, రష్యన్ దండయాత్రావకాశం తక్షణంలేదన్నమాట. ఇక్కడి తిరుగుబాటుతో వ్యవహరించడానికి బ్రిటీషు వారికెంతో వెసులుబాటు ఏర్పడి పోయింది.

తిరుగుబాటుదార్లకు అనుకోని మరోఅంశం ఎదురైంది. ఇంగ్లండు చైనాపై యుద్ధం ప్రకటిస్తుందనే సంగతి వారికి తెలియదు. ఆ దేశానికి వెళ్లే యూరపియన్ బలగాలు హిందూ మహాసముద్రం గుండా-అంటే కలకత్తాకు కూతవేటు దూరం-ప్రయాణిస్తారు. "ఈ అదృష్టకరమైన పరిస్థితుల-భగవంతుని దయవలన- మూలాన వాయువ్య భారత దేశంలో బ్రిటీషు ఆధిపత్యాన్ని అతివేగంగా పునరుద్ధరించడం సాధ్యపడింది."

ఇక తిరుగుబాటుదార్లు డబ్బుల కటకటతో బాటు, యుద్ధ సామగ్రి లోపం -హైన్యంతో-కూడ అవస్థపడ్డారు. అవధ్ తిరుగుబాటుదార్లకు ఆయుధ సంపత్తి స్వల్ప మని గుర్తించాడు: వారివద్ద 684 ఫిరంగులు, 186,177 తుపాకులు, 561,321 కత్తులు, 50,311 బల్లేలు, 638,683 చిల్లర ఆయుధాలు ఉన్నాయి. వారు చేసిన గాయాల్లో ఎక్కువ భాగం కత్తులనుంచే సంభవించాయి. కత్తి ఎన్నటికీ ఎన్‌ఫీల్డ్ తుపాకికి దీటు రాలేదు. బెంగాల్ తిరుగుబాటు సైన్యంవద్ద "మినీ రైఫిల్ ఉన్నట్లయితే ఢిల్లీ ఇప్పటికీ మొగల్ ఆధిపత్యంలోనే ఉండేది; తైమూరు వారసుడు-అంటే బహదూర్‌షా-ఈ చీకటికొట్లో మంచంమీద కాక ఇప్పటికీ తన పూర్వీకుల రాజ ప్రాసాదంలో రత్న సింహాసనం మీదే కూర్చుని ఉండేవాడు" అని ఛార్లెసు బాల్ వక్కాణించాడు.

ఎన్‌ఫీల్డ్ తుపాకికి జతగా టెలిగ్రాఫ్-తిరుగుబాటుదారులకు ఎదురునిల్చిన మరో ఆధునిక పరికరం "టెలిగ్రాఫ్ కనిపెట్టబడింతర్వాత, ప్రస్తుతం భారతదేశంలో .. అది నెరవేరుస్తున్న కార్యానికి సమానమైనది . ఇంతకు ముందెక్కడా, ఎప్పుడూ నెరవేర్చ లేదు. అది లేకుంటే సర్వసేనానికి సగంబలం పోయినట్లే, అతని కుడిచెయ్యిగా ఇది ఎక్కువ ఉపయోగపడింది" అని రస్సెల్ వివరించాడు.

అసలు సంఘటిత నిర్మాణ వ్యవస్థ లేకుండా అలాంటి తిరుగుబాటు సఫలం కాజాలదు. తిరుగుబాటు నాయకులు ఒక రూపురేఖల్లేని మంద: అన్నీ కోల్పోయిన భూస్వాములు, వెళ్లగించబడిన వృత్తిపనివారు, బీద రైతాంగం, అసంతృప్త సైనికులు, మూర్ఖులైన పురోహితులు ... స్వేచ్ఛా భారతదేశమంటే రకరకాల భావాలున్న సమూహం. వీరి మధ్యనున్న అవగాహనకు ప్రతిబింబంగా సృష్టించబడి పాలకాస్థానం; ప్రభుత్వ పద్ధతి-అది గ్రామ పంచాయితీకి స్థూలరూపం(మరి వారి రాజకీయ వారసత్వం అదేగదా!) కొత్త ప్రభుత్వపు లక్ష్యాంశం రైతుకు భూమిపై ఆధిపత్యం కలగజేయడమే! వాస్తవమే! కాని తిరుగుబాటుదార్లు విజయవంతమైనప్పటికీ ఈ కొత్త రాజ్యం-ఎన్నికలు, ఆస్థానం.... ఎంత తతంగమున్నప్పటికీ- కొద్ది కాలంలోనే పాత రాజరిక వ్యవస్థలోకి జారిపోయేది. జనరల్ బఖ్త్‌ఖాన్—ఢిల్లీ తిరుగుబాటు నాయకుడు—తనకు "లార్డ్ గవర్నర్ బహదూర్ అన్ని వ్యవహారాల అజమాయిషీదారు (సైనిక, పౌర)" అని బిరుదును తగిలించుకున్నాడన్న విషయాన్ని గుర్తుకు తెచ్చుకుంటే .. ఈ సంగతి మరింత స్పష్టపడుతుంది. ఉత్పత్తి ప్రక్రియల్లో సాంకేతికంగా విప్లవాత్మకమైన మార్పులు జరగడంవలన, తద్వారా స్థిరమైన సామాజిక సంబంధాలలో పునర్వ్యవస్థీకరణ అవసరమై కొత్త రాజ్యాంగ రూపం తప్పనిసరి కావడం వలన ఈ తిరుగుబాటు జరగలేదనే వాస్తవం కూడా ఈ సిద్ధాంతానికి బలం కలిగిస్తుంది. కొత్త వ్యవస్థ జన్మించకుండానే పాత వ్యవస్థను

రద్దు చేయడం ద్వారా వచ్చిన తిరుగుబాటు ఇది.

## కొన్ని ఫలితాలు

తిరుగుబాటు రెండు సంవత్సరాల కాలంలో అణచి వేయబడింది. కాని దాని ఫలితాలు మాత్రం విస్తృతంగా దీర్ఘకాలం కొనసాగాయి. "బ్రిటీషు ప్రభుత్వంలోనూ, వాటి అధికారులలోనూ అభివృద్ధి నిరోధకమైన అభిప్రాయాలు చోటు చేసుకున్నాయి". —సర్ జాన్‌స్ట్రాచీ. అలాగే, సంస్థానాధీశులు తుఫానుకు అడ్డుగోడగా నిలిచి అద్భుత సహాయం చేశారు గనక "వారిని సామ్రాజ్యానికి ఆధారపీఠంగా ఉంచాలనేది అప్పటినుంచీ బ్రిటీషు పాలనా సూత్రంగా రూపొందింది" అని బ్రిటీషు చరిత్రకారుడు పి. ఇ. రాబర్ట్సు నిర్ధారణ చేసాడు. భారత సమ్రాజ్ఞి అయిన తర్వాత విక్టోరియారాణి చేసిన ప్రకటన ఇలావుంది: "భారతీయ సంస్థానాధీశులతో గౌరవనీయ ఈస్టిండియాకంపెనీ ఆధిపత్యం చేసుకున్న ఒప్పందాలు, హామీలూ .. మేము అంగీకరిస్తున్నామని ప్రకటించుచున్నాము. వాటిని జాగ్రత్తగా పరిరక్షిస్తామని కూడా ప్రకటించుచున్నాము. అలాగేవారు కూడా వాటిని పాటిస్తారని ఎదురుచూస్తున్నాము .. స్వదేశ సంస్థానాధీశుల హక్కులు, ఔన్నత్యం, గౌరవం మాకు చెందినవిగానే పరిగణిస్తాము."

తిరుగుబాటు భారతీయ భూస్వాములతో, వడ్డీ వ్యాపారస్తులతో బ్రిటీషు వారి 'మైత్రి'కి దారితీసింది. మననుంచి భారతదేశపు కులీన వర్గాల వారిని దూరంచేసే విధానాలను అనుసరిస్తే పరిపాలించడం దుర్లభమౌతుందని బ్రిటీషువారు భావించారు. అందుచేత రాణీగారి ప్రకటనలో ఇలావుంది : "తమ పూర్వీకులనుండి వారసత్వంగా వచ్చిన భూమిపట్ల భారతీయ ప్రజలకున్న బంధం మాకు తెలుసు; మేము గౌరవిస్తాం. దానికి సంబంధించిన హక్కులన్నింటినీ పరిరక్షించడానికే మేము సిద్ధపడ్డాం. ...పాలనా వ్యవస్థను రూపొందించడంలోనూ, ఆచరణలోనూ భారతదేశపు ప్రాచీనమైన హక్కులకూ, సంప్రదాయలకూ, ఆచారాలకూ తగుస్థానం ఇవ్వబడుతుంది." "భారతదేశంలో రూపే లేని భూస్వామ్య కులీన వ్యవస్థను నిలబెట్టడం అతి ముఖ్యమైన కర్తవ్యం. నేలను అంటిపెట్టుకొని ఉన్న వ్యవసాయ దారుల స్వాతంత్ర్యాన్ని పెంపొందించి వారి హక్కులను రక్షించే వ్యవస్థను-ఈ వ్యవస్థ కులీనవర్గాన్ని భగ్నపరిచి, నాశనం చేసింది - ఈ కర్తవ్య పాలనకోసం 'త్యాగం' చేయడం అవసరమే" అని 1859 నవంబరులో లండన్ భారత ప్రభుత్వం సూచించింది. ఈ విధానానికి అనుగుణంగానే "పుట్టుకవలనగాని, ఉన్నతమైన కృషివలనగాని, భూమితోఉన్న గాఢ సంబంధంవలన

గాని ఏ మాత్రం ప్రత్యేకతలేని వ్యక్తులు"గా కానింగ్ ఈసడించిన..అవధ్ తాలూక్దార్లలలో మూడింట రెండు సంతుల మందికి పునరావాసం లభించింది. "రాష్ట్రాల సామాజిక నిర్మాణంలో తప్పనిసరి అంశంగా" ఈ చర్యను వర్ణించారు. ఇంకావుంది. 1858-62 మధ్యకాలంలో జమీందారీ విధాన విస్తరణ విషయమై బ్రిటీషు వారు తీవ్రంగా చర్చించారు. తిరుగుబాటు వలన సంక్రమించిన ఆర్థికమైన ఇబ్బందుల వల్ల ఈ వ్యవహారం తోసివేయబడింది. కాని భారతీయ భూస్వాములకూ, బ్రిటీషు సామ్రాజ్య వాదులకూ మధ్య నెలకొన్న ఈ "మైత్రి" భారత దేశాన్ని వ్యావసాయిక సంక్షోభంలోనికి నెట్టింది. దీనిఫలితాలు ఇంకా పూర్తిగా మాసిపోలేదు.

ఈ 'మైత్రి' ఆర్థిక రాజకీయరంగాలనుండి సామాజిక సాంస్కృతిక రంగాలకు తన ప్రభావాన్ని పొడిగించింది. "పాతపడిపోయిన సంప్రదాయరూపాల నాగరిక చైతన్య రూపాలుగా" మార్చాలనే విధానాన్ని విడనాడారు. "1857 నాటి భయంకర సంఘటనల అనంతరం - భారతీయ అధికారులకు-దేశ సంప్రదాయాలను మార్చాలంటే ఒక రకమైన భీతిపట్టుకుంది." అని అన్నాడు సర్‌హెన్రీమెయిన్. పెళ్లికి అనువైన వయస్సు, అస్పృశ్యతను తొలగించేచట్టం, హిందువులలో విడాకులు, హైందవస్త్రీలకు వారసత్వపు హక్కు- మొదలయిన సమస్యలపట్ల అభ్యుదయకరమైన మధ్యతరగతుల-పెరుగుతున్న వర్గం-కోరికలకు భిన్నంగా .బ్రిటీషువారు భారతదేశంలో ఉన్న సామాజికమైన, మతపరమైన అవశేషాలను జాగ్రత్తగా రక్షించి నిలపడానికే గట్టిగా కృషిచేసారు.

బ్రిటీషువారు ముస్లిములను, సైనికులను·· తిరుగుబాటుకు ముఖ్యప్రోత్సాహకులుగా గణించారు. అందువలన వారి విషయంలో ప్రత్యేక దృష్టి సారించారు. స్థానిక సైన్యంలో తగ్గింపుజరగాలని పీల్ కమిషన్ (1858)సిఫార్సు చేసింది. ఎంతో మంది మిలటరీ పోలీసులతోసహా, 2 లక్షల మందికి ఉద్వాసన చెప్పారు. 21 సంవత్సరాల తర్వాత ఏర్పాటైన మరో సైనిక కమిషన్ తిరుగుబాటు నుంచి రెండు గుణపాఠాలను గుర్తించింది. మొదటిది: దేశంలో "ఎదురులేని బ్రిటీషు సైన్యాలను" నిలిపి ఉంచడం. రెండు: "ఫిరంగి దళాన్ని యూరపియనుల ఆధిపత్యంలో మాత్రమే ఉంచడం". లార్డ్‌కానింగ్‌కు "బానిసల అనుకూలుడ"ని ఇంగ్లండ్‌లో పేరుంది. అతని 'క్షమాభిక్ష' వ్యవహారం ఎన్నో విమర్శలకు గురైంది. తాను ఆక్రమించిన సైన్యానికి చెందిన వాడిననే భావం మరచి పోయేంతవరకు భారత దేశంలో ఉండడానికి యూరపియన్ సైనికుని అనుమతించరాదని లార్డ్‌కానింగ్ సిఫార్సు చేసాడు. 1861 నాటి సైన్య సమీకరణ ప్రణాళికలో ఈ సూచన చోటుచేసుకుంది. అదేవిధంగా, ప్రధానమైన కోశాగారాలు, భారీ ఆయుధాగారాలు, వ్యూహాత్మక స్థానాలు, కీలకమైన కోటలు, సైన్య

స్థావరాలు....వీటన్నింటినీ "తిరుగుబాటు చెలరేగినప్పటికీ . . రక్షించుకోగం" సంఖ్యా బలం గల యూరపియన్ సైన్యం మాత్రమే అధీనంలోకి చేర్చబడ్డాయి.

బ్రిటీషువారి క్రోధానికి ముస్లింలుకూడా గురి అయ్యారు. తిరుగుబాటులో ప్రధాన పాత్ర నిర్వహించారని బ్రిటీషువారు-వారిని-నిందించారు. "ఈ దుర్మార్గులైన ముసల్మానులకు" పాఠంనేర్పడానికి జజ్జార్, బల్లబ్ ఘర్, ఫ్రరూక్ నగర్ నవాబులనూ, మరో 24 మంది షహజాదాలనూ ఉరితీసారు. ముస్లిముల ఆస్తిని స్వాధీనం చేసుకున్నారు లేదా ధ్వంసం చేసారు. అపరాధం క్రింద ముస్లిములు స్థిరాస్థిలో 35శాతం కట్టాలిసి వచ్చింది. అదే హిందువులకు 10 శాతం మాత్రమే. ఢిల్లీ తిరస్కరించడం ఇంచుమించు "సంపూర్ణం" ఆ ధోరణిలో ఉన్న నష్టాన్ని వారు గమనించే సరికి-సర్ సయ్యద్ అహ్మద్ ఖాన్ లాంటి వారి పుస్తకాలద్వారా-హిందువులు విద్యలో ఎంతో ముందుకు సాగిపోయి, ప్రభుత్వోద్యోగాలలోనూ, వ్యాపారాల్లోనూ పాతుకుపోయారు-చదువుకున్న వారికి అవకాశమున్న రంగాలు అవి మాత్రమే. ఈ అసమానమైన అభివృద్ధి హిందూ-ముస్లిమ్ సమస్యను రేకెత్తించింది. అదే తర్వాతికాలంలో భారతజాతీయ పోరాటాన్ని వక్రమార్గం పట్టించింది. బ్రిటీషువారు దీన్ని ఆసరాగా తీసుకున్నారు. ఉపయోగించుకున్నారు. ఇదే పాకిస్తాన్ సృష్టికి దారితీసింది.

తిరుగుబాటు తర్వాత బ్రిటీషు సామ్రాజ్య విస్తరణ ఇంచుమించు నిలిచిపోయింది. ఉన్నదాన్ని పటిష్టం చేసుకునే సామ్రాజ్యవాద దశ ప్రారంభమైంది. "ఇంచుమించు తిరుగుబాటు కాలానికి, కొత్త ప్రాంతాలను కలుపుకునే క్రమం ఇంచుమించు నిలిచిపోయింది. అయితే తర్వాతి పావు శతాబ్దంలో కొత్తగా ఆక్రమణలేవీ జరగనప్పటికీ.... వ్యాపారంలో విపరీతమైన పెరుగుదల జరిగిన కాలమది."—సర్ జాన్ సీలీ. అశోక మెహతా అంచనా ప్రకారం వ్యాపారాభివృద్ధి 360 శాతం చేరుకుంది.

రైల్వేలు, రోడ్లు విపరీతంగా నిర్మించబడడం, పెట్టుబడి వలస అంతర్గత పునరాక్రమణ జరిగిన కొద్ది మాసాలకు హిందువులను తిరిగి రానిచ్చారు. ముస్లింలను 1859కి ముందు రానీయలేదు. "ఢిల్లీలో విద్య తిరిగి ప్రారంభమయ్యే లోపునే క్షీణత ప్రారంభమయ్యింది. దాన్నుంచి ఢిల్లీ కోలుకోనే లేదు."— సి. యఫ్. ఆండ్రూస్.

మిగతా చోట్ల, మిగతా రాష్ట్రాలలో కూడా ఇదే పరిస్థితి.

ముస్లిములు బ్రిటీషు వారిపై తమ పోరాటాన్ని కొనసాగించారు — బహిరంగంగా కాకపోయినా, రోజూ వెలిబుచ్చే వ్యతిరేక భావాల్లోనైనా. బ్రిటీషు సంస్కృతి, నాగరికత, తత్వశాస్త్రం, విద్య, బ్రిటీషు అని పేరున్న ప్రతిదీ వారికి ద్వేషం కలిగించేది. అందువలన తిరుగుబాటు అనంత కాలంలో "యూరపియన్ కళలనుంచీ,

విజ్ఞానశాస్త్రంనుంచీ ఉత్తేజితులైన హిందువులు .. మానసిక, నైతిక పునరుజ్జీవనాన్ని అనుభవిస్తుండగా భారతదేశంలోని ముస్లిములు భౌతిక దుస్థితిలోనికీ, మానసిక క్షీణత లోనికి జారిపోయారు."— థియోడోర్ మోరిసన్.

దీని ఫలితం: "ఒక శతాబ్దం ముందు ప్రభుత్వంలో ఏకైక శక్తిగా ఉన్న ముస్లింల నిష్పత్తి మొత్తం పాలనావిభాగంలో 23వ వంతుకు దిగిపోయింది. ఈ నిష్పత్తి కూడా అతి జాగ్రత్తగా ఎన్నిక జరిగే ఉన్నత అధికారుల వ్యవస్థకు సంబంధించింది. అంత గుర్తింపులేని కార్యాలయాల సిబ్బంది విషయంలోనైతే ముస్లింల మార్కెట్లు తెరుచుకున్నాయి. అందుకే అభివృద్ధి అంతగా పెరిగింది. కాని "రైల్వేల గమనానికి ప్రతిక్షణం, తక్షణం అవసరమైన ఉత్పత్తులను సృష్టించే పారిశ్రామిక క్రమాన్ని ఏర్పాటు చేయకుండా, అంతటి విశాల దేశంలో రైల్వే వ్యవస్థను నడిపించజాలవు. దాన్నుంచే .. రైల్వేలకు ఏ మాత్రం సంబంధంలేని పారిశ్రామిక శాఖలు అభివృద్ధిచెంది తీరుతాయి. ఆ క్రమం ...భారతీయ కుల వ్యవస్థకు పీఠమైన సంప్రదాయ శ్రమ విభజనల రేఖలను - భారతీయ పురోగతికి, భారతీయ శక్తికి ఆటంకాలవి - కరిగించివేస్తుంది." అని మార్క్స్ రాసాడు. ఆ విధంగా ఇంగ్లండు "వాస్తవంగా దుష్ప్రయోజనాలనాశించి కదలిక ప్రారంభించి"నప్పటికీ. ."ఆసియా చరిత్రలో అత్యున్నతమైన, వాస్తవం చెప్పాలంటే, ఏకైక సామాజిక విప్లవానికి, చైతన్య వంతమైన చారిత్రక పరికరంగా" పనికి వచ్చింది. కాని ".... భారతీయులే ఇంగ్లీషు పాలనను మొత్తంగా కూలద్రోయగల బల సంపన్నులుగా ఎదిగే వరకు. .. బ్రిటిషు వారు వారిలో చెల్లాచెదురుగా చల్లిన సామాజిక లక్షణాల ఫలితాలను భారతీయులు అనుభవించజాలరు" అని కూడా మార్క్స్ హెచ్చరించాడు. ఈ వాస్తవాన్ని గమనించిన తర్వాతనే భారతీయులు 1886లో స్వాతంత్ర్యం కోసం సంఘటిత పోరాటాన్ని ప్రారంభించారు. 61 సంవత్సరాల అనంతరం 1947 ఆగష్టు 15న వారు స్వాతంత్ర్యం పొందారు.

ఈ చిన్న పుస్తకం రచించడానికి తల్మిజ్ ఖల్దున్ అనేక వందల పత్రాలను, కొన్ని డజన్ల పుస్తకాలను పరిశీలించాడు. మొత్తం 341 ఉల్లేఖనలు, సూచికలు ఇందులో ఉన్నాయి.

**ముఖ్యమయిన పుస్తకాల జాబితా**


1. "తిరుగుబాటు"— ఈ పేరుమీద సర్ జాన్ విలియం కేయే, కర్నల్ జి.బి. మెలెసన్, ఇంకా అనేకులు పుస్తకాలు రాశారు.
2. వి. డి. సావర్కార్ : భారతీయ స్వాతంత్ర్య సంగ్రామం, (1946).
3. జి. డబ్ల్యు. ఫారెస్టు : భారతీయ తిరుగుబాటు చరిత్ర, (1904).
4. సర్ డబ్ల్యు. హెచ్. రసెల్ : నా భారతదేశపు డైరీ 1858-59, (1860
5. సర్ జార్జి కాంప్ బెల్ : భారతదేశంలో నా ఉద్యోగ స్మృతులు, (1893).
6. థామస్ లోవె : తిరుగుబాటు కాలంలో మధ్య భారతం, (1860).
7. రెవరెండ్ జె. కేవ్-బ్రౌన్ : పంజాబు-ఢిల్లీ - 1857, (1861).
8. ఆర్. సి. దత్ : భారతదేశ ఆర్థిక చరిత్ర (1950-7వ ముద్రణ).
9. మార్క్ థార్న్‌హిల్ : స్వీయానుభవాలు - తిరుగుబాటు (1884).

ఇంకా సర్ సయ్యద్ అహ్మద్‌ఖాన్, జాన్ స్ట్రాచీ, రజనీ పామీదత్ మొదలైన అనేకుల గ్రంథాలు.

## కొన్ని ముఖ్య సంఘటనలు

1857 మే, 9 : మీరట్‌లో 85 మంది సిపాయిలపై మిలటరీ కోర్టు విచారణ. కొవ్వు పూసిన తూటాలను అంటుకోవడానికి నిరాకరించటమే వారు చేసిన నేరం. ఒక్కొక్కరికి 10 సంవత్సరాల శిక్ష పడింది.

10 : మీరట్‌లో 3 సైనిక దళాల తిరుగుబాటు. ఖైదులో ఉన్న తోటి సిపాయిలను విడుదల చేసి వారంతా ఢిల్లీకి బయలుదేరారు.

11 : ఢిల్లీ ఆక్రమణ. సిపాయిలు బహదూర్‌షా జఫర్‌ను భారత చక్రవర్తిగా ప్రకటించారు.

13-31 : తిరుగుబాటు అనేక ప్రాంతాలకు విస్తరించింది. ఫిరోజ్‌పూర్, ముజ్‌ఫర్ నగర్, ఆలిఘడ్, నౌషేరా, ఎటావా, మైన్‌పురి, రూర్కి, ఎటా, నసీరాబాద్, మధుర, లక్నో, బారెల్లీ, షాజహాన్‌పూర్.

జూన్, 1-5 : మొరాదాబాద్, బాదోన్, ఆజమ్‌ఘర్, సితాపూర్, నీముచ్, బెనారస్, కాన్పూర్, ఝాన్సీలలో కూడా తిరుగుబాటు ప్రజ్వరిల్లింది.

6 : నానాసాహెబ్ కాన్పూరును ముట్టడించాడు.

7-8 : ఝాన్సీకోట స్వాధీనమైంది. రాణీ లక్ష్మీబాయి తిరిగి సింహాసనమెక్కింది. బద్లీసరాయ్ యుద్ధం. ఢిల్లీ వద్దనున్న పర్వతశ్రేణి బ్రిటిష్‌వారి స్వాధీనమయ్యింది.

9-13 : పోరాటజ్వాల దరియాబాద్, ఫతేపూర్, నౌగాన్, గ్వాలియర్, ఫతేఘర్ లకు వ్యాపించింది.

26-27 : కాన్పూర్ నానాసాహెబ్ స్వాధీనమయింది.

జూలై, 1 : హత్రాజ్, ఇండోర్‌లలో తిరుగుబాటు.

తిరుగుబాటుదారులు లక్నో రెసిడెన్సీని ముట్టడించారు.

12 : ఫతేఘర్‌వద్ద జ్వాలాప్రసాద్, టికాసింగ్‌ల నాయకత్వంలోని నానాసాహెబ్ సైన్యాల ఓటమి.

జూలై, 16 : కాన్పూరు యుద్ధము, నానాసాహెబ్ దళాలు బితూర్‌కు ఉపసంహరణ.

23 : జగదీష్‌పూర్‌లో కున్వర్‌సింగ్ బ్రిటిష్‌వారిని మరోసారి ఓడించుట.

26 : కున్వర్‌సింగ్ మరణం.

1858 మే, 6 : బరేలీని బ్రిటిష్‌వారు బహదూర్‌ఖాన్ నుంచి స్వాధీనం చేసుకున్నారు.

11 : మౌలావి అహమ్మదుల్లా షా రక్షిస్తున్న షాజహాన్‌పూర్‌పై బ్రిటిష్ వారి ముట్టడి ప్రారంభం.

22 : 2వ కాల్పియుద్ధం. లక్ష్మీభాయి, బందానవాబు, రావు సాహెబ్ (నానాసాహెబ్ దగ్గరబంధువు) తిరుగుబాటుదారులకు నాయకత్వం వహించారు.

24 : కాల్పి బ్రిటిషువారి స్వాధీనమయింది.

జూన్, 1 : రాణి లక్ష్మీభాయి, రావుసాహెబ్, బందానవాబ్‌లు గ్వాలియర్ సింథియాను ఓడించారు. గ్వాలియర్ కోటను పట్టుకొని నానా సాహెబ్‌ను పీష్వాగా ప్రకటించారు.

17 : బ్రిటిషువారిచే గ్వాలియర్ ముట్టడి. యుద్ధరంగంలో రాణీ లక్ష్మీభాయి వీరమరణం. తాంతియాతోపే చిక్కలేదు. గ్వాలియర్ తిరిగి బ్రిటిషువారికి స్వాధీనమయింది.

ఆగస్టు, 2 : తూర్పిండియా కంపెనీ బ్రిటిషు రాజ్యానికి దత్తమయింది.

14 : కోట్రా (ఉదయపూర్) యుద్ధం, తాంతియాతోపే ఓటమి.

అక్టోబర్, 17-19 : బ్రిటిషువారిచే జగదీష్‌పూర్ ముట్టడి. దానికి రక్షకుడు కున్వర్ సింగ్ సోదరుడైన అమర్‌సింగ్. నేనడిలో అమర్‌సింగ్ ఓటమి.

1859, జనవరి, 21 : సికార్ యుద్ధం, తాంతియాతోపే ఓటమి.

ఏప్రిల్, 7 : రాజా మాన్‌సింగ్ ద్రోహంవల్ల తాంతియాతోపే బ్రిటిష్‌వారికి చిక్కాడు.

18 : తాంతియాతోపే ఉరి.

అక్టోబర్-డిసెంబర్. : అవధ్, నేపాల్ ప్రాంతాలలోని తిరుగుబాటు దారులపై ఆఖరి పోరాట చర్యలు; డిసెంబరులో 4000 మంది నానాసాహెబ్ అనుచరుల పట్టివేత.